

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౧. { దుందుభినామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౨.

# విషయసూచిక.

శ్రీః

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

సంపుటము ౧౧. | దుందుభినామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧.

## ఆంధ్రభాష:—ప్రకృతిశాస్త్రములు.

మఱాటాడు దేశభాషలందుఁ దెలుఁగులెస్స యనునందుకుఁ దార్కాణముగ నాంధ్రమందు రసపూరితము లగుకీర్తనలు రచించిరి. కథలను జెప్పిరి. జగదేకధన్వి యగు నామన్మథుని పరాక్రమమున కంకితముగఁ గావ్యములు వ్రాసిరి. ఆచిన్నతనపుఁ జేష్టలుడిగినవి, నవనవయౌవనరాగోదయచిహ్నము లగుగీతములు గడచినవి. సరససల్లాపగూఢవాగాడంబరములకాల మేగినది. ఎందుఁజూచినను, జీవయాత్రకు వలయుసామగ్రి సంపాదించికొనవలయు నను బాధ్యత రానురాను తీవ్రమై కఠినమై ప్రత్యక్ష మగుచున్నది. మనమెటు చూచినను సర్వదేశములవారు నిదివఱకే గ్రాహకము వచ్చి వారివారి బుద్ధి కనులోపముగ వారివారియత్నముల కనుకూలముఁగ స్థితిగతు లేర్పఱుచుకొనిరి. మన మన్నో మొన్న మొన్నటివఱకు బాల్యవిలాసములయందె మునిఁగి యుంటిమి. ఇపు డిప్పుడె యవన్నియు వదలివైచి జీవనము సుష్ఠుగ నడచుట కుపాయములు వెదక నారంభించినారము. ఈనడుమ రెండుమూఁడు సంవత్సరములనుండి శృంగారప్రబంధము లేమియుఁ బేరు గలవి బయలుదేఱకుండుట కిదియె యర్థము!

ఈవిధముగ నవసరము మనసునకు నాటి చూచుటయుఁ, జిల్లరలెక్కలును, బాలబోధయు ననవచ్చుపాటి మాత్రము కార్మికవిద్యావ్యాసంగమును

సాయము చేసికొని భావిఫలగర్భిత మగునూహ యాధారముగా, నిది యటు చేయుదు రదియిటు చేయుదు రను వినికిడి జ్ఞానము సాధనముగా సంపూర్ణముగఁ దంత్రము దెలియకున్నను, జేతిపనుల సాధింప యత్నించుచున్నారు. సాధింప యత్నించుచుండుటయు, సాధింపవలయు ననుకోరికకుఁ జిన్నెయె కాన, శుభ సూచనయె.

## శాస్త్రప్రాముఖ్యత.

అయినను, నిశ్చితతంత్రజ్ఞానము లేనిదె యేకృషియు ఫలింపనేరదు. నూతనవిషయావగాహనమును గలుగదు. జ్ఞానమంతయు నేరెండు సూత్రముల లోనో యిమిడినట్లుండి, యనుశ్రుతానుభవమె యాదర్శముగ నుండి పద్ధతు లన్నియు స్తబ్ధములై యుండును. ఇందులకు నిదర్శనముగఁ బ్రతివ్యాపారము నందును మన దేశపుఁ గర్మకరుల ప్రకృతావస్థ విమర్శించుకొనవచ్చును. వీరినీరస మునకు ముఖ్యకారణము, విపులముగ నాయావృత్తులకు సంబంధించిన యావ ద్విషయములు, నుపపత్తిసహితముగాఁ జర్చించుగ్రంథములు లేకపోవుటయె.

## ప్రకృతిశాస్త్రముచే నేమైనది.

తక్కినవానిమాట యెటున్న నైహికతంత్రములందు మాత్రము, పాశ్చాత్త్యులవలన మనము నేర్చుకొనఁదగు విషయములు గలవు. ఐహికతంత్రవిద్యలు ప్రస్తుతము వారియందు మిగుల విజృంభించుచున్నవి. వారిదినచర్యయంతయు గుతంత్రనిశ్చితమై యున్నది. వారి సౌకర్యము లన్నియు దానిచేఁ బుట్టినవి. ఇంట దీపము వెలిఁగించుటకు, వీవనవిసరుటకును, బరువులమోయుటకును, స్థాన చలనమునకు, మేడలనెక్కించుటకు దింపించుటకు, భూగర్భముఁ బెల్లగించుటకు, నింకను బళుబల మెందెందుఁగావలయునో యన్నిటికి యంత్రము లుపయోగించుచున్నారు. ఇఁక నారోగ్యరక్షణమున నాహారపచనమున నౌషధసేవణ మునఁ గూడ, స్థూలము లగుమానవేంద్రియములు సమగ్రముగ సూక్ష్మజీవుల నంతమొందింపలేనిపట్ల నంత మొందింపను, గావలయునంత కోమలముగ సిద్ధముసేయుటకును, గలపవలయునంత పూర్ణముగఁ గలుపుటకును, రసాయన పద్ధతు లవలంబించుచున్నారు. శరీరము శరీరలక్షణము శాఖోపశాఖలుగ సిద్ధాంతములుపెంచి విమర్శించుచున్నారు. ఈతంత్రవిద్యాప్రభావమున, మానవుఁడు నిజముగ నపురూప మగువస్తు వనియు, నట్టివానిని మోటుపనులందుఁ బెట్టి పాడుచేయఁగూడ దనియు, దేవునితరువాత దేవునియంతటివాఁ డగు ననియు విశ్వాసము ప్రబలినది. కాకున్నఁ బ్రకృతము హాశాస్త్ర్మృతులఁ బున

ర్జీవితులఁ జేయునుపాయము తంత్రవిద్యాపారీణులు సాధించితి మని చెప్పుచున్నారే దాని భావ మే మగును?

### ప్రకృతిశాస్త్రము లిన్నాళ్లనుండి చదివి మనవా రేమియుఁ జేయలేక పోయి రేల?

ఎన్నిమాఱులు సెప్పినను పాశ్చాత్యు లీవిషయముల సాధించి రనిచెప్పుచుంటిరే కాని సుమా రొకశతాబ్దార్థవత్సరములనుండి మనవా రావిద్యల నభ్యసించుచుండియు నింతవఱకు నొ కనిపించుకొన్న విశేష మొకటియు సాధింపలేక యుండుటయు, దానికిఁ దోడుగఁ బాశ్చాత్యవిహితులు గొందఱు భారతదేశీయుల బుద్ధి యనుకరణమాత్ర సామర్థ్యము కలది కాని, నవనవోన్మేషణములకుఁ జాల దని చెప్పుచుండుటయు నది చూచి మనవారును గాఁబోలు ననుకొనుటయు మన మెఱుంగుదుము. అటులు దిగువాలు పడియున్న బుద్ధిమంతు లందఱు నొకమాఱు పాశ్చాత్యనాగరకతకెల్ల నాది యగు యవన దేశమునందు, మహాసముద్రయానారంభ సంరంభమునఁ బ్రథమనౌకానిర్మాణమునకు రెండువేల సంవత్సరములపూర్వము, మహాభారతాఖ్యాన వర్ణనాంతర్గతము లగుసంఘవ్యవస్థయు నార్థికజ్ఞానమును నీతినైపుణ్యమును, ధర్మసంపత్తియు బ్రహ్మతత్త్వార్థవేదిత్వమును గణితము శిల్పమును బశుపాలనయు జ్యోతిషమును సాధించిన మహామేధావంతుల సంతానసంగ్రహము నేఁటివఱకు వారిసంఘనిర్మాణనైపుణ్యమున నంతమొందక కొంచెము మిగిలియున్న దనుమాట స్మరించెదరు గాక. వార లెవ్వరి ననుకరించి రని యడిగెదరుగాక. ఇంతధైర్యము నింతయాశ కేవల కలిపూర్వాబ్దసంపాదితములైన విద్యలఁ జూచి కాదు. యవన మహాసేనాని మెచ్చినసాంఘిక నైతిక విజ్ఞానప్రతిష్ఠలను వదలి తరువాత వచ్చిన రసశాస్త్రవిజృంభణము విడిచి మనబుద్ధికి సన్నిహితముగ నుండి యూహించుటకు వీలుగ నున్న మహమ్మదీయకాలమునందు రచించిన గణితమునఁ బ్రస్తుతము Differential Calculus అని వ్యవహరించు "ప్రసారణీగణిత" ప్రసక్తి యెవరి ననుకరించి వచ్చినది? అదియును వదలి నేఁడు పాశ్చాత్యపండితులంద అను శారీరశాస్త్రమునకు వృక్షశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతము లన్నియు మార్చుకొనవలయు కాలము వచ్చిన దనిపించిన జగదీశచంద్రబోసు గారి యసమానప్రతిభ యెవరి యనుకరణము? కావున హైందవబుద్ధి నవనవోన్మేషమునకుఁ జాల దనుమాట చెల్లదు.

వాస్తవమున కంతియ యైనను ప్రకృతిశాస్త్రపరిచయమున మనవా రింత వఱకు నార్థికవృద్ధి సాధింపనికారణమునఁ గొందఱు పాఠశాలలందు రసశోధ నాశ్రమము లనవసరము లనియు ధనవ్యయకారణము లనియు నందు బాలురు సేయునదంతయుఁ బరీక్షార్థ మగుమిథ్యాచార మనియు నధిక్షేపించుచున్నారు. మఱియు నానాశాస్త్రముల సాధించిన మనపూర్వు లేశోధనాశ్రమమునఁ దంత్ర ప్రయోగ శిక్షితులై రని ప్రశ్నించుచున్నారు. కాని మనము చేయుపని యెంత బాగుగనుండునది రెండు సంగతులంబట్టి నిశ్చయింపవచ్చును. మనకుఁ గల శ్రద్ధయు శాస్త్రపద్ధతులందుఁ దగు శిక్షయు నాయర్థమునకుఁ దుదఁ గలుగు ప్రాశస్త్యమునకుఁ గారణము లగును. శ్రద్ధ యనునది కార్యావసరమునుబట్టి తాత్కాలికముగఁ బుట్టు నాసక్తిమాత్రము గాదు. అది ప్రారంభము నుండియు నుండవలయును. చిన్నప్పటినుండియు నియమములకు లోఁబడియుండుటయు బహిస్సంస్కారముల గ్రహింపవలయుపట్ల నిరహంకారముగ నుండుటయు నలవడియుండవలయును. కావున నింత యుత్కృష్ట మగుశిక్ష యింటనే యారంభింపవలయును. దినచర్యయంతయు విలాసము చొప్పునఁ గాక నియమమున నడువవలయును. అదియే జీవనము శాస్త్రపద్ధతి నుండవలయు నందురు.

"తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి."

అనుమాట లాధ్యాత్మికప్రవర్తన కెంతముఖ్యములో నిత్యకృత్యములకు నంత ముఖ్యము లని గ్రహింపవలయు. అట్టిక్రమశిక్షచేఁ గలిగిన యహంకారశూన్య మగుమానసికస్థితినె శ్రద్ధ యని చెప్పితిని. అదియె శాసనమునకు లోఁబడి యుండుజీవనము. ఆవిధముగ శాసనమునకు లోఁబడియుండి నేర్చినవారె ప్రకృతి శాస్త్రశోధనకుఁ దగినవారు. వారె ప్రకృతిపరిణామముల దమకల్పనలు లేక పరీక్షించి యాప్రకృతిమార్గములను గ్రహించి యామార్గముల ననుసరించుట వలనఁ బ్రకృతిని సుముఖము గావించికొని తమకు వశపఱుచుకొనఁగలరు. అట్టి వారిబుద్ధియె దృఢముగఁ జివరవఱకుఁ బ్రకృతిశోధన నడుపు సామర్థ్యము గలిగి యుండును. ఇట్టిక్రమశిక్ష మనపూర్వులకు విశేషముగఁ గలదు. నిత్యకర్మల యందు నిత్యచర్యలయందు వారిజీవనమంతయు శాస్త్రశాసితమై యున్నది! దానినె మనము పూర్వాచార మనియు ఛాందసం బనియు నియమశూన్యముగఁ బ్రవర్తించుట యలవడిన యీకాలమునందు నిరసించుచున్నారము. పూర్వుల శాస్త్ర దార్ఢ్యమున కిది యొకకారణము. ఆకారణముననె కొన్నిమాసముల వెనుక

నొకబుద్ధిశాలి బ్రాహ్మణేతరవిద్యార్థులకు బుద్ధిచెప్పుచు "మీరుమాత్రము పాఠశాలలను విడువవలదు. బ్రాహ్మణులపిల్లలు చదువుమానినను వారికి విద్య యింటనె కలఁ" దని చెప్పెను.

ఈవిధముగ దినచర్యయందు బుద్ధిస్థైర్యనైర్మల్యముల కాధార మెటు లున్నదో యటులె మేధావృద్ధికి వ్యాకరణశాస్త్రము వారికి సాయమై యుండెను. అందుఁ గలపద్ధతి కేప్రకృతిశాస్త్రపద్ధతియుఁ జాలదు. అట్టిబుద్ధిమంతులు తక్కిన శాస్త్రములు సాధించుసామర్థ్యము గలవా రగుటయం దాశ్చర్య మేమియు లేదు.

ఈవిషయములు దృక్పథమున నుంచుకొని యట్టియస్ఖలిత శిక్షావసరముఁ జూచిన నున్నతపాఠశాలలందుఁ బ్రకృతిశాస్త్రశోధనాలయములు కేవలవ్యయకారణము లనియు నందు బాలుఁడు సేయున దంతయుఁ బరిపూర్ణమైన మిథ్యాప్రవర్తన మనియుఁ జెప్పుట కవకాశము గలుగదు. ప్రకృతితంత్రప్రయోగమున ననుభవము గలబాలుఁడు శుచిగ నుండుటయు, నోపికతోఁ బనిచేయుటయు, శాసనము పాటించుటయుఁ, దానుఁజేయుప్రతికార్యము సమగ్రముగఁ జేయుటయు నేర్చుకొనును. నిత్యకృత్యముల నేదే నొకవ్యవస్థగఁ దీర్పవలయు నగత్యము దెలియును. తరువాత నూతనవిషయ మేదైన ఘటించినప్పుడు తెల్లపోయి చూడఁడు. దానిలక్షణముఁ దెలియవలయు నను జిజ్ఞాస గలిగియుండును. చేయి పనులందు సుకుమారముగఁ దిరుగుట యలవడును. అందువలన నీ ప్రకృతితంత్రశిక్ష విద్యావిధానమునం దెల్లఁ బ్రధాన మైనది. ఆశిక్షయందుఁ దేఱినవిద్యార్థి మొదటినుండియు నుద్దిష్టఫలమునకు నిర్దేశించినవిధానము తూచా తప్పక యనుసరించిననె యాఫలము సిద్ధించు నని నేర్చుకొనును గాన నుత్తరకాలమునఁ గర్మవిద్యలయందు సూక్ష్మముగఁ బ్రవేశించి విజయ మందుట కవకాశము గలదు. మనవా రనుకొనునట్లు ప్రకృతిశాస్త్రపరిచయమాత్రమునఁ జేతిపను లన్నియు సాధింపఁగల సామర్థ్యము గలవాఁ డగు ననియు నట్టివాఁడు యంత్రముల నిర్మింపను నడిపింపను సంస్కరింపను శక్తిగలవాఁ డగు ననియు నూహించుట పొరపాటు. ప్రకృతిశాస్త్రసిద్ధాంతము లన్నియుఁ బదార్థపరమావస్థయందు, అనఁగా స్థౌల్యము లేనటు లూహించినయవసరమునందు, వర్తించు సూత్రములు. ఆసూత్రములు సృష్టిసామాన్యధర్మముల శాసించును. కర్మకరు లన్ననో మిగుల భారముగలవియు నానావస్థలయం దున్నవియుఁ బరస్పరస్థిత్యవరోధకరము లగునవియుఁ బరస్పరవిరోధధర్మములు గలవియు నగుస్థూలపదార్థములతోఁ బనిచేయవలయును. వానియందుఁ బైనిరూపించిన మూలధర్మములు

ప్రవర్తించునపు డేయేవైషమ్యములు పుట్టునో తెలియవలయును. వానికిఁ బ్రత్యేక మనుభవశాస్త్రము పుట్టవలయును. ఈయనుభవశాస్త్రమునకు పైఁ జెప్పిన సిద్ధాంతరూపమున నున్నతత్త్వమ యాధార మగును. కార్మికవిద్యాప్రసక్తి శూన్యునకు శుద్ధప్రకృతితంత్రమునం దెంతప్రావీణ్య మబ్బునో యంతసూక్ష్మముగ నాకర్మవిద్యాప్రవేశము గూడ నలవడును.

ప్రకృతిశాస్త్రశిక్షయం దింతలాభ మున్నను మనవిద్యార్థు లింకను దానియందుఁ దగుచాకచక్యమును జూపుట లేదు. ఆశాస్త్రము లభిమానములుగఁ బఠించుబాలురసంఖ్యయు నల్పముగ నున్నది. ఆతక్కు వగుట విషయము నూతనమైన కారణము గాదు. అది బహుక్లేశమునఁ గాని యలవడదనుభయము. ఆశాస్త్రశిక్షయందు వలయుజాగ్రత్తయు మెలఁకువయు బుద్ధిసారళ్యమును నన్నిటికన్న ముఖ్యముగఁ బ్రయోగవర్ణనములం దుపయోగించు నుచితశబ్దార్థశుద్ధియుఁ జాలమందిబాలురకందరానిఫలము లైనట్లు భ్రమకలుగుచున్నది. శాస్త్రమందు సహజముగ నున్నక్లేశమునకుఁ దోడుగ నీభాషావరోధముగూడ భయము గలిగించుచున్నది. ఆశాస్త్రమె మనయాంధ్రమున బోధించిన నింతకష్ట మనుపింపవలయు కారణ మగపడదు. దేశభాషయం దెంతక్లిష్టభావ మైనను నిర్దుష్టముగఁ వెలిపుచ్చవచ్చును. అలవాటు పడినమాటలు సులభముగ మనసునకుఁ బట్టును. భావమునకుఁ దగినమాటలు కుదురక కష్టపడవలసిన యవసరము లేనందున బుద్ధియంతయు విషయముననె నిలిపి చదువవచ్చును. అన్నిటికన్న ముఖ్యమైనది మనభాషయం దున్నంతనే యాజ్ఞానమంతయు మనదె యనుస్వాతంత్ర్యము వచ్చును.

ఐనను గొందఱు విద్యావిధానదక్షులు ప్రస్తుతమున్న విద్యాపరిస్థితులం బట్టి పాఠము లన్నియు నాంగ్లమున బోధించిననె కాని యాభాషయందుఁ దగినపాండిత్యము విద్యార్థులందు వర్ధిల్ల దనియు నన్నిపాఠము లాంగ్లమునందె బోధించుచున్నను బ్రతివత్సరమును బరీక్షలం దాంగ్లమునందె పరీక్షలు పోవుచున్న వనియు నాంగ్లేతరపాఠము లాంధ్రమునఁ జెప్పు మనుట విద్యార్థి నధోగతిపాలు చేయుటయె యనియు వాదించుచున్నారు.

పాఠము లన్నియు నాంగ్లమునఁ జెప్పుచున్నను బ్రస్తుతవిద్యావిధానమున నొకపెద్దలోప మున్నది. విద్యాప్రవర్తకులు సదుద్దేశములతో నేర్పఱిచిన కొన్నివ్యవస్థలు క్రియారూపములుగ మాఱునపుడు విపరీతములై మీఁదికి మిగిలి

వచ్చుచున్నవి! బాలురకు హూణభాష క్రొత్తగాన నందుఁ బరిచయము మెండుగఁ గావలయు ననిరి. సవిశేషముగఁ జదువవలయు గ్రంథములు కొన్ని యేర్పఱిచిరి. కథామాత్రము గ్రహించి వదలవలయు గ్రంథములు కొన్ని యేర్పఱిచిరి. ఈ రెండవమాదిరి గ్రంథములను బూర్తిగఁ జదివిన బాలుఁడే లేఁడు. ఊరక యే యుపాధ్యాయుఁడో వ్రాసిన కథాసంగ్రహములు మాత్రము చూచుచున్నాఁడు. అందువలన బాలునకుఁ గొంత బద్ధక మలవడుచున్నది. శ్రద్ధ తగ్గుచున్నది.

## విద్యావిధానమున లోపము.

దీనికి సహాయముగ నాంగ్లేతరపాఠములందు బాలుఁడు భాషాస్ఖాలిత్యము లెన్ని గావించినను బరీక్షోత్తరపత్రముల గుణముల కందుచే లోపము రాదను నభయ మిచ్చియున్నారు. బాలురు తమతమ యభిమానశాస్త్రముల మిగుల శ్రద్ధతోఁ బఠించుపట్ల భాషాసౌష్ఠవమునకు శుద్ధికిఁ దగుప్రయత్నములేక యాపట్ల ననాస్థగ నుండుకారణమున భావజాడ్యము గలిగి యాంగ్లభాషాశుద్ధి తప్పుటయే కాక, యభిమానశాస్త్రమందు ముఖ్యముగ శ్రద్ధయు నియమమును నేకాగ్రతయుఁ దన్మయత్వమును వలయు ప్రకృతిశాస్త్రభాగమందుఁ జిందఱవందఱగఁ బనిచేయుచు శుచి వదలి వాలాయమునకుఁ జేయునట్లు చేయునంతటి మనోదౌర్బల్యమునకు దిగిపోవుచున్నారు. ప్రతినిమేషము నభ్యసించుచున్న విద్యయం దింత చపలత్వమును మనోదౌర్బల్యము నేర్పడినతరువాత నాబాలున కెంత వివరముగ బోధించిన నెన్నిమాఱులు హెచ్చరించిన నెన్నిసారులు బుజ్జగించిన నెన్నివిధములఁ జేసిచూపినఁ దంత్రప్రయోగవేళ శుచియు నిగ్రహము నలవడకున్నవి. అవి లేనపు డెంతప్రకృతితంత్రము చదివిన నొకటే. ఇం దంతయు భాషావిషయమున బాలున కిచ్చినస్వేచ్ఛవలనఁ గలుగుచున్నది కదా యని పూర్వమువలె వ్రాఁతయు నిర్దుష్టముగ లేనిచోఁ బరీక్షకోత్తములు గుణహీనము లగునని తిరిగి శాసించిన నంతకు మించిన యన్యాయము లేదు. చదువవలయు శాస్త్రము బహుక్లిష్టమైనది. అభ్యసింపవలయునది పరభాష. ఇఁక భాషాసౌష్ఠవమునకుఁ గూడఁ బ్రాముఖ్యత వచ్చెనేని పరీక్షార్థుల కష్టమున కంతము లేదు.

## ప్రకృతిశాస్త్రము లాంధ్రమున బోధింపవలయును.

ఇఁక గత్యంతర మొకటె. ప్రకృతిశాస్త్రప్రభృత్యభిమానశాస్త్రము లన్నియు నాంగ్లమునఁ గాక యాంధ్రమున బోధింపవలయును. శాస్త్రము లాంధ్రమున బో

ధించినంతమాత్రమున నాంగ్లమునం దుపేక్ష కలుగదు. ఆంధ్రము సంస్కృతము నభిమానముగాఁ బఠించు బాలున కాంగ్లమునఁ బాండిత్యమున కేపాటిలోపము కలుగుచున్నది? "Type writing" నాంధ్రము నభిమానముగఁ బఠించు బాలుర యాంగ్లమున కేమియవరోధము వచ్చినది? వాస్తవమున కభిమానశాస్త్ర మేది తీసికొనినను పూర్ణపాండిత్యము బాగుగఁ గలుగుటకే యాభాగమునం దిన్ని పాఠపుస్తకములు విద్యాప్రవర్తకు లేర్పఱచినారు. కావున నాంధ్రమున నభిమాన శాస్త్రము పఠించిన నాంగ్లమునఁ గృషి తగ్గు ననుట కల్ల. ఆంగ్లభాషాధికారము తగ్గదు సరిగదా యది చదువుటకు సావకాశముచు జనవకున్నఁ దగినంత పాండిత్యములే దనుభీతియుఁ గలసి యిన్నిపుస్తకము లున్నలాభము గలుగుటకుఁ దగు నవకాశమును గలదు.

ప్రకృతిశాస్త్రము లాంధ్రమునఁ జదువనారంభించిన నాశాస్త్ర మనినఁ బ్రస్తుతమునఁ గల భయము తగ్గును. తక్కినపాఠము లన్నియు నెంత సులభములై యుండునో యవియు నంతసులభములుగనె యుండును. నూతన మనిపింపదు. ప్రస్తుతము గృహమందుఁ బసుపు సున్నము గలసిన నెఱ్ఱ పగు నని స్త్రీలకు సహితమెటులు పరిచయమై యున్నదో రసాయనప్రక్రియలు నంతపరిచయము వచ్చునట్లు చేయవచ్చును. అప్పుడు ప్రకృతిశాస్త్రము గూడ దేశవిద్యలపాటిదై యందు స్వతంత్రత వచ్చును. ప్రస్తుతకాలమున నీవిద్యయందుఁ బరదేశవాసన వెక్కసముగ నున్నది. రంగులాకు మొక్కలు కుంపటులందుంచి జాగ్రత్తగ ముట్టిన చెడునో, పట్టిన వాడునో యని పైనుండి చూచునటులె ప్రస్తుతము పూర్ణభాషయం దీశాస్త్రము లభ్యసించువారు దానియందు స్వాతంత్ర్యముఁ బడయలేకున్నారు. స్వంతముగ నూతనాంశముల గ్రహింప లేకున్నారు. నిత్యము మనయింట మనచుట్టునుం గలవస్తుజాలములఁ దమశాస్త్రదృష్టి నరయలేకున్నారు. తమగ్రంథములందుఁ జదివినపేరులతోడ గాజుగొట్టములందుఁ బ్రత్యక్షమైననె కాని యావస్తువులను బోల్చుకొనలేకున్నారు. ఈయవస్థ ప్రకృతిశాస్త్రములు విదేశభాషయందుఁ జదువుచుండునంతవఱకు నుండవలసినదె.

జపాను మొదలగునూతనవిజృంభణము గలదేశములందుఁ గార్మికతంత్రము లన్నియు దేశభాషయందే యున్నవి. ప్రత్యేకముగఁ బట్టపరీక్షానంతరము పర దేశములందలి విశేషములు నేర్చుకొనుటకుఁ గొలఁదిమంది మాత్ర మాంగ్లము నభ్యసించుచున్నారు.

మన దేశమం దావిధముగఁ జేయుటకు బాలకులు పూనుకొన లేదు. వారి కంత తొందరయు లేదు. ఈకార్యమును మనమె సాధింపవలయును. ఉత్తర దేశమున నిప్పటికె గణితాదిశాస్త్రములు సంస్కృతమున హిందియందును బ్రబలి మనపండితు లవి పురాతనములె యనియు భ్రమపడుచున్నారు. ప్రకృతిశాస్త్ర పరిభాష నిర్ణయించికొని యొకనిఘంటువును గూడ రచించుకొనినారు. మన మును వారి ననుసరింపవలయును. ప్రకృతిశాస్త్రములతో నాంధ్రభాష ముంచి వేయవలయును. మొదటితరగతి మొద లుపాధ్యాయపదవిపర్యంతమును గావ లయు విషయము దేశభాషాసంఘటితము సేయవలయు. అప్పుడె మనవారు స్వతంత్రశోధనలకుఁ జాలియుందురు. ఓపికయు వచ్చును. నిత్యజీవనము సుక రము సారోగ్యమును గాఁగలదు. ప్రకృతివిజయము గాఁగలదు. అట్టివిజయము చేఁగల్గిన యాత్మవిశ్వాసముతో విశ్వాసమునఁ గల్గినబలముతో బలమునఁ గల్గినయున్నతితో దానసైన స్వయంవ్యక్తిత్వము గనిపింప మనుజులలో మను జులవలె బ్రదుకుసామర్థ్యముగలవా రగుదురు.

ధేరం - వేంకటాచలపతి.

---

శ్రీరస్తు.

# అశ్లీలత్వనిరూపణము.

అశ్లీలత్వ మనునది కావ్యదోషములలో నొకటి. కావ్యమున కపకర్ష కలిగించునది యిట దోష మనఁబడును. రమణీయ మగునర్థముం బ్రతిపాదించుశబ్దము కావ్య మని కావ్యలక్షణము చెప్పఁబడినది. అందపకర్ష మనఁగా రమణీయార్థప్రతిపాదనమునకు భంగము. కొన్ని యర్థమునందలి రమణీయతం జెఱచును, గొన్ని యర్థబోధమునే ప్రతిబంధించును. కొన్ని యర్థబోధమునందు విలంబము గలిగించును. కొన్ని చదువరులకు వైముఖ్యము నుత్పాదించును. ఇట్లు దోషములస్వభావ మూహనీయము. ఈదోషములు కొన్ని నిత్యము లని కొన్ని యనిత్యము లని చెప్పఁబడినవి. నిత్యములు సర్వథా హేయములు. అనిత్యము లొకపట్టున హేయము లైనను మఱియొకపట్టున నుపాదేయము లగును. చ్యుతసంస్కారత్వము సర్వథా హేయం బగుటవలన నిత్యము. శ్రుతికటుత్వంబు శృంగారంబున హేయం బయ్యును రౌద్రంబున నుపాదేయం బగుటవలన ననిత్యంబు. ఇట్లితరములును వివేచనీయములు. శబ్దగతము వాక్యగతము నర్థగతము రసగతము నని దోషములు కొందఱాలంకారికులచే విభజింపఁబడినవి.

అయినను వాక్యాదు లన్నియు శబ్దసంబంధైకనిబంధనంబు లగుటవలన సర్వదోషములును శబ్దగతము లని గ్రహించుటందు లాఘవము గలదు. శబ్దవిశేషమే కావ్యం బని పండితరాజు పెక్కుహేతువులచే సిద్ధాంతించె. కావునఁ దద్దోషములును శబ్దాశ్రితము లనియే గ్రహింపవలయు.

అర్థము స్వభావంబున దుష్టము కాకున్నను శబ్దవిశేషముచే బోధితమై దోషముం బుట్టించు. "అమ్మమగఁడు" ఇత్యాదికం బుదాహార్యంబు. ఈదోషములు శబ్దాశ్రితము లనియే గదా నిశ్చయింపవలయును. అర్థములు కొన్ని స్వభావంబున దుష్టము లయ్యును గావ్యమునందుఁ దత్సంభవము కవిప్రయుక్తశబ్దాధీనం బగుటచేఁ దదీయదోషము శబ్దమునందే పర్యవసన్న మగుచున్నది.

మఱియుం గేవలార్థములు దుష్టములు సంభవించినను నవి దుష్పరిహారంబు లగుటవలనఁ దద్వివేచనం బిటఁ గావ్యలక్షణమున నిరర్థకము. పరిహారార్థము దోషవివేచనము. కేవలార్థమునందు దోషము పురుషాధ్యాసభేదకల్పితము కాని స్వాభావికము గాదు. కటిశబ్దము గ్రామ్యము. నితంబశబ్దము గ్రామ్యము గాదు. అందువలననే దుష్టములుగాఁ దోఁచువాని నుపాదేయములుగాను నదుష్టములుగాఁ దోఁచువాని హేయములుగాను శబ్దశక్తిప్రభావము భాసిల్లఁజేయఁ జాలియున్నది.

ఎట్టియర్థం బేనియు మహాకవిప్రయుక్త మృదుమధురపదవిశేషబోధితమై సహృదయహృదయంగమ మగుచున్నది. ఇట్లు విపరీతమును గ్రహించునది. ఇదియే కవితాచమత్కృతి.

ఇది దోషసామాన్యస్వరూపము. ప్రకృతనిరూపణమం దుపయోగించుటకై సంక్షేపముగ వివరించితి. ఇఁకఁ బ్రకృతము. అం దశ్లీలమనఁగా శ్రీకరము కానిది యని యర్థము. శ్రియం లాతి - శ్రీ నాకర్షించునది శ్లీలము. అది కానిది యశ్లీలము. కపిలాది యగుటవలన రేఫమునకు లకారము. సహృదయవశీకరణశ్రీరహిత మని యొకానొక కావ్యకోవిదుఁడు వక్కాణించె.

లజ్జాజనిసంపాదక మగు గ్రామ్యభాష యని తర్కవాచస్పతి. శబ్దరూపమయిన కావ్యమునందు మాత్రమే కాదు శబ్దరూపమయిన సర్వవ్యవహారమందును నీయశ్లీలమును వర్జింపవలయును. "నాశ్లీలం కీర్తయేత్" అశ్లీలశబ్దము నుచ్చరింపఁ గూడ దని వేదము విధించుచున్నందువలన దేవతాప్రీతి సిద్ధించు నని శాసించుచున్నది.

ఎల్లప్పుడును జాగరూకులై యశ్లీలశబ్దము నుచ్చరింపక వ్యవహరించువారు దేవతాసంప్రీతి సంపాదకులై నిరంతరాభ్యుదయపరంపరాభాజనం బగుదురు.

కొన్నిదోషములు కావ్యమునందు మాత్రమే పరిహార్యములు. ఈయశ్లీలము సర్వశబ్దవ్యవహారమునందును బరిహార్యము. కావున నిది ప్రబలదోషములలో నొక్కటి యని గ్రహించునది.

మఱియుఁ గావ్యప్రణేతలే గాక యీదోషమును సర్వజనులును గ్రహించి పాటించి పరిహరింపవలయు. ఇయ్యది లజ్జాజనిజననముచే రసావిర్భావభంగము గావించును. పాఠకశ్రావకులకు వైముఖ్యంబు గలిగించు. వర్ణ్యవిషయకపాఠనిష్ఠ భావప్రకర్షమునకు విఘాతమ్ము నెఱపు.

మఱి ప్రయోక్తకు నశ్రేయం బాపాదించు. ఏతత్కార్యరూపము లగు లజ్జాజుగుప్సామంగళముల భేదమును బట్టి సర్వాలంకారికులును దీనిం ద్రివిధంబుగా విభజించియున్నారు. లజ్జాజుగుప్సామంగళాన్యతమవ్యంజకత్వ మని మూఁడువిధంబులకును సాధారణలక్షణము - లజ్జావ్యంజకము, జుగుప్సావ్యంజకము, నమంగళవ్యంజకము నగుశబ్దము లశ్లీలము లని యేర్పడుచున్నది. అనఁగా సిగ్గుఁ బుట్టించునదియు రోఁతఁ బుట్టించునదియు నమంగళము తోఁపించునదియు నశ్లీలము లని యర్థము. లజ్జాజుగుప్సలు చిత్తవృత్తివిశేషము లగుటవలనఁ దద్వ్యంజకశబ్దశ్రవణమాత్రమున జనియింపవచ్చుం గాని యమంగళము వస్తువిశేషమగుటచేఁ దద్వ్యంజకశ్రవణంబున జనియింపనేరదు. భావనామాత్రవిషయం బగును గావున నమంగళముం దోఁపించునది యని భేదము చెప్పఁబడినది. సాక్షాద్వేదనిషిద్ధం బగుటచే నశ్లీలసామాన్యమునకుఁ బాపరూపామంగళజనకత్వ మవిశిష్టము. అయ్యమంగళము ప్రయోక్తృమాత్రసంబంధి యదృష్టము. ఇఁక వర్ణ్యనం దమంగళాశంక దృష్టము పాఠకశ్రావకుల కని గ్రహింపవలయు. వేదవిహితప్రతిషిద్ధముల నాచరించుటం గలుగుశుభాశుభములు కాలాంతరానుభావ్యంబు లగుటచే నదృష్టములు. ఇఁట నలంకారశాస్త్రంబునఁ బ్రతిపాదించువిషయము లేకాంతమున వస్తుతంత్రము లగుటచే శబ్దవిశేషపరిశీలనమాత్రంబున సహృదయుల కనుభవగోచరంబు లగువ్రీడాదికార్యముల నిరూపించుద్వారంబున నశ్లీలస్వరూపం బావిష్కరింపఁబడినది. అందు వ్రీడాజనకాశ్లీలమున కుదాహరణము కావ్యప్రకాశమునందు—

శ్లో॥ సాధనం సుమహద్యస్య యన్నాన్యస్య విలోక్యతే
తస్యధీశాలినః కోన్య స్సహేతారాలితాంభ్రువమ్॥

ఇందు సాధనశబ్దముచే సైన్యము వివక్షింపఁబడినను పుంవ్యంజనము ప్రతీత మగుచున్నది. కావున నిది పాఠకులకు వ్రీడాజనకంబై నాయకవిషయకభావప్రకర్షభంగమును బఠనశ్రవణములందు వైముఖ్యమును గలిగించుటం జేసి దుష్టము. మఱియు వాక్యగతమునకు—

శ్లో॥ భూపతే రుపసర్పంతీ కమ్పనా వామలోచనా।
తత్తత్ప్రహరణోత్సాహ వతీ మోహన మాదధే॥

ఇట నుపసర్పణ ప్రహరణ మోహనశబ్దములు క్రమముగా రతోద్యమమును దత్కాలికజఘనాదితాడనంబును సురతమును వచియించు నని కామశాస్త్ర ప్రసిద్ధము. ఇవి శ్రోత్రకు వ్రీడాదాయకము లగుటవలన నశ్లీలములు.

జుగుప్సాజనకమునకు—

శ్లో॥ లీలాతామరసా హతోఽన్యవనితా నిశ్శంకదష్టాధరః ।
కశ్చిత్కేసరదూషితేక్షణ ఇవ వ్యామీల్య నేత్రే స్థితః ।
ముగ్ధా కుట్మలితాననేన ధమతీ వాయుం స్థితా తత్ర సా ।
భ్రాంత్యా ధూర్తతయాఽధరా నతిమృతే తేనాభవ చ్చుంబితా॥

ఇట వాయుశబ్ద మపానవాయుబోధకంబగుటచే జుగుప్సాదాయకము. దీనికే వాక్యగతమునకు—

శ్లో॥ తేఽన్యై ర్వాంతం సమశ్నన్తి పరోత్సర్గంచ భుంజతే।
ఇతరార్థగ్రహే యేషాం కవీనాం స్యాత్ప్రవర్తనమ్॥

ఇందు వాంతోత్సర్గప్రవర్తనశబ్దములు జుగుప్సాదాయకము లనుట స్పష్టము.

ఇఁక నమంగళాశ్లీలమునకు—

"శ్లో॥ మృదుపవనవిభిన్నో మత్ప్రియాయా వినాశా ।
ఘనరుచిరకలాపో నిస్సపత్నోఽద్య జాతః ।
రతివిలులితబంధే కేశపాశే సుకేశ్యా ।
స్సతికుసుమసనాథే కంహరే దేషబర్హాః॥

ఇట వినాశశబ్దము మరణప్రతీతిబోధకం బగుటచే నమంగళాశంకాప్రదము. దీనికి వాక్యగతమునకు—

"శ్లో॥ పితృవసతిమహం వ్రజామి తాం। సహపరివార మనేనయత్ర మే।
భవతి సపదిపావకాన్వయే హృదయ మశేషిత శోకశల్యకమ్॥

ఇందుఁ బితృవసతి పావక శబ్దములు శ్మశానచితాగ్నిప్రతీతికరము లగుటవలన నమంగళాశంకాదాయకంబులు. ఇట్టు లశ్లీలస్వరూపంబును దదుదాహరణంబును వివరింపఁబడినది.

ఇందువలన స్త్రీపుంసవ్యంజన తదీయాభ్యంతర వ్యాపారబోధకములగు శబ్దములు వ్రీడాశ్లీలము లనియు నపానవాయ్వాది బోధకశబ్దములు జుగుప్సాశ్లీలము లనియు మరణాదిబోధకశబ్దము లమంగళాశ్లీలము లనియు నేర్పడుచున్నది. ఇట నియ్యది మీమాంసనీయము. ఇం దుదాహృతములగు సాధనాదిశబ్దములు మాత్రమే యశ్లీలములా? తత్సమానార్థబోధకసర్వశబ్దములు నశ్లీలములా యని. ఎందువలన నీయాశంక? కటి గల్ల శబ్దములు గ్రామ్యము

లని చెప్పఁబడినవి. తత్సమానార్థక నితంబ కంఠ శబ్దములు గ్రామ్యములు కావని తెలియుచున్నది. కాన శంకించుచున్నవారము. అప్పుడును సాధనాది శబ్దములే యశ్లీలము లగుఁగాక సంశయమునకుఁ గారణమే లేదు. అశ్లీలత్వ మునకు వ్రీడాదివ్యంజకత హేతువుగాఁ జెప్పుటవలనఁ గలదు సంశయకారణము. ఏదేది వ్రీడాదివ్యంజకమో యది యంతయు నశ్లీల మని సిద్ధమగుచుండఁగాఁ దత్సమానార్థకశబ్దములును నశ్లీలములే యని యేర్పడుటవలన నీసంశయము నిరవకాశమే యగుచున్నది. తత్సమార్థకము లగుకొన్ని యశ్లీలములు కావని తోఁచున ట్లుదాహరించుటవలనఁ గలదు సంశయావకాశము.

మఱియు శబ్దగతవ్రీడాశ్లీలమునకు "సాధనం సుమహ ద్యస్య" యని కావ్యప్రకాశికోదాహరణము. సాహిత్యదర్పణమునందును శ్లో॥ దృప్తారివిజయే రాజన్ సాధనం సుమహ త్తవ ॥ యని యీసాధనశబ్దమే యుదాహరింపఁ బడినది. ఒండుశబ్దము దొరకలేదా? ఇందుచేఁదదర్థాభిధాయి శబ్దాంతర మశ్లీలము కాదేమో యని యొకానొకఁడు సంశయింపవచ్చును. వ్రీడావ్యంజకత హేతువు చెప్పఁబడియుండఁగాఁ దదర్థబోధకశబ్దాంతర మశ్లీల మేల కాకపోవు నందు రేని సాధనశబ్దమునకుఁ బుంవ్యంజనవాచకత్వము నిఘంటుప్రసిద్ధము కాదు. కాను శాస్త్రమాత్రమందే ప్రసిద్ధము. కొఱముట్టు వనునర్థమో నిఘంటువునందును లోకమునందును బ్రసిద్ధ మనుట యెల్లరకును విదితము. శాస్త్రవిశేషమాత్ర సంకేతిత మగుశబ్దం బప్రతీత మని చెప్పఁబడినది. అప్రతీతత్వ మనునది దోషాంతరము. ఈసాధనశబ్దమును బుంవ్యంజనార్థమునందుఁ గాముశాస్త్రమాత్ర మందే ప్రతీతి యగుటచే నిట నయ్యర్థము వివక్షిత మయ్యెను దాని బోధింపఁ జాలక యప్రతీతము కావలయును. కాని లోకాప్రసిద్ధ మగు వ్రీడాజనకార్థమును బోధింపఁజాలదు. అప్పు డశ్లీలత కిది యె ట్లుదాహృతం బయ్యె? చెప్పెదను. కటిశబ్దము గ్రామ్యత్వదోషము గలది యని యుదాహరింపఁబడినది. గ్రామ్య మనఁగా నాగరవ్యవహారాయోగ్య మని యర్థము. అట్టిదానిం బ్రయోగించిన యెడ సభ్యులు సహింపరు. ఆగ్రామ్యత్వము తదర్థమునందుఁ గానరాదు గదా? తద్ఘటకవర్ణములందును గానఁబడదు. తచ్ఛబ్దమునందును గ్రామ్యత్వ హేతువు లేమియుఁ బ్రత్యక్షములు కావు. అప్పు డందు గ్రామ్యత్వనిబంధన మేది? నాగరజనులచే వ్యవహరింపఁబడకుండుటే యని చెప్పవలయును. అది కాల క్రమాభ్యాసవిశేషమువలన వచ్చినది గాన దానికి హేతువు నిర్ధారింపశక్యము గాదు. అట్లు సాధనశబ్దమునందును వ్రీడాజనకత కిట్టిదికొ హేతువు గ్రహింప

వలయు. గ్రంథకర్తృదేశతత్కాలములయందిది పురుషవ్యంజన ప్రతీతిజననార్థము గ్రామ్యజనులచేఁ బ్రయోగింపఁబడుచుండి యుండును. అది వ్యవహారాతిశయ వశమున వారలకు నిఘంటుసిద్ధార్థమును బాధించి వ్రీడాజనకార్థప్రతీతినే కలి గించును. తత్కాలప్రసిద్ధిని బట్టి యాహేతువున నది యశ్లీలముగా నుదాహ రింపఁబడిన దని యెఱుంగవలయు. ఇప్పుడు సాధనశబ్దమునకుఁ దాదృశార్థ ప్రతీతిజననయోగ్యత యున్నట్లు నాకుఁ దోఁపలేదు. విద్వాంసులు స్వాను భవముఁ బరిశీలింతురుగాక. ఒకదేశమునందు వ్రీడాజనకమై మఱియొకదేశము నందు కానిశబ్దములు తెనుఁగునందును గలవు. దొబ్బుశబ్ద మిట నుదాహా ర్యంబు. ఇది యీమధ్యదేశమున వ్రీడాజనక మని యేతద్దేశజులకు నెక్కువ వక్కాణింప వలసినదిలేదు. బెంగుళూరు మొదలగు కొన్నిదేశములవారి కిది లజ్జాజనకము కాదు. ఒకానొకపుస్తకవర్తకబ్రాహ్మణుఁడు విద్యావంతుడు కొంత కాలమునకు మున్ను మా బంధువుల యింటికి వచ్చి యుండి యొకప్పు డొక్క యాఁడుపిల్లంజూచి "వాకిలితలుపు దొబ్బవమ్మ" యనెను. అంత నింటిలోనివా రాయనమీఁదికి జగడమునకుఁ బోయి రని చెప్పఁ బనిలేదు. ఆయన బమ్మర వోయి వెనుకఁ దమదేశమునం దట్లుచెప్పుటవలనఁ దప్పులే దని యొకవిధమున సమాధానపఱిచె. నాకుఁ దిరుచనాపల్లినుండి యిటీవల నొకయుత్తరము వచ్చి నది. అందు "మొత్తముగా గ్రంథములు కొనువారి కేమికమిషన్ దొబ్బు తారు" అని యున్నది. వారికిఁ ద్రోయుట వివక్షితము. ఇది మహాకవిప్రయో గమునందును లేకపోలేదు.

మఱియును మోహనశబ్దము సురతప్రతీతిజనక మగుట నశ్లీల మని చెప్పఁ బడియె. సాధనశబ్దోదాహృతన్యాయమునఁ గామశాస్త్రమాత్రసంకేతిత మగు నర్థము బోధింపఁజాలనందునఁ బూర్వోక్త మగు తద్దేశతత్కాలవ్యవహారవిశే షమే లజ్జాజనకత యందు హేతు వని నిశ్చయింపఁ దగును. సాక్షాత్తద్వాచక మగురతాదిశబ్దము నుదాహరింపక యప్రసిద్ధ మగుమోహనపదము నుదాహ రించుట దీని నుపపాదించుచున్నది. అమంగళాశ్లీలమున కుదాహృత మగు పద్యమునం దుపస్థిత మైన రతిశబ్దము నుదాహరింపమి దీని దృఢపఱుచుచున్నది.

"యః కౌమారహరః" ఇత్యాదికములు రతిసురతాదిపదఘటితములు పెక్కులు పద్యములు సర్వాలంకారికులచే నాదరపూర్వకంబుగా నుదాహరించి తదర్థము చర్చింపఁబడినది. అందలి సురతాదిపదము లశ్లీలము లనిచెప్పఁబడినవి కావు. ఇందువలన రతిసురతాదిశబ్దము లశ్లీలములు కావని యాలంకారికాభి ప్రాయము నిశ్చేయ మగుచున్నది.

ఈవిషయంబున నుదాహృతంబు లైనపద్యములు పెక్కు లుదాహరింప వచ్చును. ఏకవాచకము లైనకొన్నిశబ్దములు దుష్టములు కొన్నియదుష్టము లని యీావలికే నిరూపింపఁబడియున్నది. కావున మోహనశబ్ద మశ్లీలమయ్యును సురతాది పదము లశ్లీలములు కా వనుట కేమియు విరోధము లేదు. ఇందు వలన స్పష్టార్థము లైనసురతాదిపదముల నుదాహరింపక యస్పష్టార్థములైన సాధనమోహనాదిశబ్దములనే సర్వాలంకారికులు నుదాహరించుటచేత నీసిద్ధాంత మేర్పడుచున్నది.

లోకవ్యవహారమువలన నేశబ్దములు వినువారికి వ్రీడాజనకములుగా నలవాటుపడియున్నవో యాశబ్దము లశ్లీలములు. నాగరు లాశబ్దములను వ్రీడాజనకంబు లను నభిప్రాయంబునఁ బ్రయోగింపమి వలన నవి గ్రామ్యభాషలోఁ జేరిన వని తెలియవలయు.

కావుననే యశ్లీలశబ్దమునకు వ్రీడాదిసంపాదక మైనగ్రామ్యభాష యని వాచస్పతి వ్రాసె. ఇంతమాత్రమునఁ దదర్థబోధకము లైనయితరశబ్దములు సభ్యవ్యవహారసిద్ధము లగునవి యశ్లీలములు కావని యు నేర్పడుచున్నది.

ఈన్యాయమునే తెనుఁగునందును నన్వయింపవలెను. సురతాదిపదములు మహాకవిప్రయుక్తము లై రసావిరుద్ధము లై సభ్యవ్యవహారసిద్ధము లై యుంటవలన నశ్లీలములు కావనియుఁ దదర్థవాచకము లైనగ్రామ్యశబ్దము లశ్లీలంబు లనియు నిశ్చయింపవలయును.

చెదలువాడ సుందరరామశాస్త్రి.

---

శ్రీరస్తు.

# ఆర్యభాషావిభాగము.

---

## 1. భాషోత్పత్తి.

భాష యనఁగా మనుష్యులు తమమనస్సులో నుండెడునభిప్రాయముల నొకరితో నొకరు తెలుపుటకు సాధన మని సంగ్రహముగాను విస్తృతముగాను నిర్వచింపవచ్చును. ఇంతకంటె విపులముగాను ధారాళముగాను జెప్పవలసి వచ్చినచో నేరీతిగా నైన నభిప్రాయరూప మయి పరులు గ్రహించునట్లు చేయునది యంతయు భాష యని చెప్పఁదగును. అందు కుదాహరణముగా ననేకశతాబ్దములక్రిందట నాకాలపుమనుష్యులు నిర్మించిన దేవాలయములు దుర్గములు సౌధములు మొదలగువాని యందుఁ జూడఁబడు శిల్పనైపుణి యప్పటి వారి లోకోత్తర మగుమేధాసంపదను, నుత్సాహమును, నోపికను, గర్మశ్రద్ధను వేయినోళ్ల మనకుఁ దెలుపుచున్నది. కాని యిట్టిదానిని శాస్త్రరీతిగాఁ బ్రతిపాదింపవలసివచ్చినచో భాష యని మనము వ్యవహరించుటకుఁ జెల్లదు. అట్లయినచో మూకులు మొదలగువారు తమయభిప్రాయముల నొరులకుఁ దెలియఁజేయుట కొనర్చుహస్తశిరఃకంపాదిసంజ్ఞలకుఁ గూడ భాష యనుపేరు వర్తింపవలసివచ్చును. కావున మనుష్యులు తెలివితో నొకప్రయోజనము నుద్దేశించి దానినిఁ బరులకుఁ దెలియఁజేయుటకుఁ దగిన వాగ్రూపసాధనమునకే భాష యనుపేరుఁ బెట్టవలెను.

ఇదిగాక యొకరియభిప్రాయముల నింకొకరికిఁ దెలియఁజేయుట కితర సాధనము లనేకము లున్నవి. అవి యెవ్వి యనిన; హస్తసంజ్ఞ, శిరఃకంపము, బొమ్మలు వ్రాయుట మొదలగునవి. ఇవి యన్నియుఁ గంటిచే గ్రహింపఁబడును గాని వాక్సంజ్ఞ కున్నంతవైశద్యము వీనికి లేదు. మూకు లొనర్చుసంజ్ఞలవలన వారియభిప్రాయము లంతగాఁ బరులకు స్పష్టము గానేరవు. లిఖితచిహ్నములు మొట్టమొదట మనోవృత్తులఁ దెలియఁజేయుటయందు స్వతంత్ర మగుసాధనము లయినను జారిత్రపరిణామమందు భాష కంగమయి భాషతో సంబద్ధము లగును. పూర్వోక్తములగు నెవ్వియును వాక్సంజ్ఞకు సాటి రావు. ఇది యన్నిటికంటె నమోఘ మయినది. ఆవశ్యకమయినది. కావున దీనికే భాష యనుపే రిడఁదగి.

యున్నది. భాషయనఁగా వీణాశుకశారికాదిధ్వనులవలె నవ్యక్తముగా నుండక వ్యక్తోచ్చారణ గలకకారాదివర్ణములతోఁ గూడిన పదసంఘాతరూప మయి స్వాభిప్రాయముల నొరులకుఁ దెలియఁజేయుటకు సాధన మయినది. భాషారూప మగునిట్టిసాధన మేదో యొకరీతిగాఁ బ్రతిమనుష్యసంఘమునకుఁ గలదు. నాగరకులు మొదలుకొని మూర్ఖు లగు పార్వతీయులవఱకు మనుష్యు లందఱు నేదో యొకభాష మాటలాడుదురు. వారిమనస్సులో నుండెడు నాశయములఁ బరులకుఁ దెలియఁజేయఁగలరు. కావున భాషయనునది మనుష్యునికి సహజ మయినదిగాను నీశ్వరదత్త మగువరముగాను మార్పుఁ జెందని హక్కుగాను గానవచ్చుచున్నది. భాషపైఁ బూర్ణస్వామ్యము భగవత్సృష్టిలో నొకమనుష్యునికే గాని యితరజంతువులకు లేదు. గుంపులుగా జీవించెడు నితరజంతువులుఁ గూడ తమయక్కఱలను దమయభిప్రాయములను బైకిఁ దెలుపుటకుఁ జాలినంతశక్తి గలవియై యున్న వని చెప్పఁగలము. ఎట్లనఁ, గోపముతో నున్నపుడొకరీతిస్వరము, తనపోషకు నెదుటఁ జూచి యానందముఁ బొందునపు డింకొకరీతిస్వరము గలిగి యుండెడు కుక్కయఱపులలో భిన్నమయిన యభిప్రాయములు గానవచ్చుచున్నవి. అట్లే పెంపుడుకోడి తా నుల్లాసముగా మేయుచున్నపు డొకవిధముగాను, నాకాశముపైఁ దిరుగుచున్న డేగ గ్రద్ద మొదలగుపక్షులు తనతో మేయుచుండెడి పిల్లలపైఁ బడునని తోఁచినపుడు భయోద్రేకమును సూచించుట కింకొకమాదిరిగాను బరులవలన నేదైన నపాయము కలుగు నని తోఁచినసమయమందు జాగ్రత్తతో నుండుఁడని తనపిల్లలకుఁ దెలుపుటకు మఱియొకభంగిగాను నఱచును. ఇట్టిజంతువులుచేయుధ్వనులు మనుష్యులభాషకంటె నెంతమాత్రము తక్కువ కావు. ఈమృగధ్వనులు నానావిధము లయి యవ్యక్తధ్వనులుగా నుండుటవలన వీనికి భాషయనుపేరు న్యాయముగా వర్తింపదు. మనుష్యుని కున్నశక్తు లన్నిటిలో భాష మిక్కిలి యాశ్చర్యకర మయినది. మృగధ్వనులకంటె నత్యంతభిన్న మగునీమనుష్యభాష కూడ నానావిధభేదభిన్నమయి కానవచ్చుచున్నది. అది ప్రత్యేకభాషలయొక్క సమూహము. ఈప్రత్యేకభాషలు మిక్కిలి విజాతీయము లయియున్నవి. ఒక భాష మాటలాడు మనుష్యులలోనే వారువారు నివసించు దేశముల భేదమును బట్టియు వారియలవాటును బట్టియు వారియాచారములఁ బట్టియు నొకరు వాడుకచేయు పదము లింకొకరికిఁ దెలియకుండ నున్నపుడు విజాతీయభాషలకు భేదముండుట యాశ్చర్యమా? ఇందున కుదాహరణముగా నీదిగువ నొకసంగతి

నుడివెను. విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, ఉత్తరార్కాడు మొదలగుజిల్లాలలో నుండువా రందఱుఁ దెలుఁగే మాటాడుదు రన్నయంశము మన మెఱిఁగినదే. అయిన నొకజిల్లావారు వ్యవహరించెడు కొన్నిపదము లింకొకజిల్లావారికిఁ దెలియవు చూడుఁడీ. ఎట్లన; గోదావరిజిల్లాలో వాడుకచేయఁబడు మాగాణి (పంటనేల) కమతము (సేరీ) గండి (తెగినగట్టు) పుంత (గోర్జ) కాఁడి (పూఁజు) బఱ్ఱె (గేదె) మొదలగుమాటలు విశాఖపట్టణమండలనివాసులకుఁ దెలియవు. నెల్లూరువైపు వాడుకలో నున్న ముంత (3½ సేరులు) కయ్య (వరిమడి) నున్న (తవుడు) గనిమ (గట్టు) కంగు (ఉగ్గు) బొంద (అరఁటిదూఁట) పచారు (కిరాణాదినుసులు) చల్లకము (వెదచల్లుట) తలారి (ఊరబారిక) మొదలగు పదములు తక్కినజిల్లాలవారి వాడుకలో లేవు. ఇట్లొకదేశమం దుండి యొకభాషనే మాటాడువారిలోనే ప్రదేశభేదమును బట్టి యొకరిమాట లింకొకరికిఁ దెలియకుండ నున్నపు డయిరోపా మొదలగు మహాభూఖండముల దేశములలో నివసించువారిభాషలు పరస్పర మవిజ్ఞాతములయియుండుననుట యొకవింత కాదు. ఇట్లు భాషలు ప్రత్యంశమందు నొకదానితో మఱియొకటి భేదించి యున్నను దగినంత శ్రమచేసి విమర్శింపవలసిన రీతిగా విమర్శించినయెడల నొకభాషతో మఱియొకభాష కున్న సాదృశ్యము సాజాత్యము మనకు సులభముగాఁ దెలియును. ఒకప్పు డాపాతముగాఁ జూచినను మఱికొన్నిభాషల కున్నసాదృశ్యము స్పష్టముగాఁ దెలియును. ఈభాషలన్నియు నాయాయి యభిప్రాయములఁ దెలుపుశబ్దజాలమందు భేదము గలిగి యుండుటయేగాక రచనయందు సంబంధమందు భాషాభాగములయందు నమితభేదముగలవియై యున్నవి. నౌకాశాస్త్రము (Nautical Science) రసాయనశాస్త్రము, (Chemistry) వృక్షశాస్త్రము (Botany) భూగర్భశాస్త్రము (Geology.) మొదలగు శాస్త్రములలోఁ బ్రయోగింపఁబడిన యాంగ్లేయభాషా పారిభాషిక పదములకు సరియయినపదములు మనసంస్కృతభాషలో లేవు. అట్లే మన శ్రౌతతంత్రముతో సంబంధించిన పదముల యర్థము గలశబ్దములు పాశ్చాత్యభాషలలోఁ గానరావు. అంత దూరము చన నేల? ఆంగ్లేయభాషా వాక్యము నొకదాని నాంధ్రభాషకు మార్చునపుడు గాని యాంధ్రభాషావాక్యము నాంగ్లేయభాషచే ననువదించునపుడు గాని యనుభవముగల యుపాధ్యాయులై యున్నవారే కష్టపడుదురు. ఈభాషా వైవిధ్యము భాషావ్యవహర్తల బుద్ధిసామర్థ్యభేదములఁ బట్టి కలిగినది కాదు. ప్రజ్ఞావిశేషము గలమనుష్యులందఱు

వారివారిచాతుర్యము కొలఁది నొకభాషనే మాటాడుచుండుట మనము చూచుచున్నారము. భిన్నభిన్నసంఘములలోఁ జేరినబంధువు లగువారు నైతె మొకరి భాష మఱియొకరికిఁ దెలియక పోవుటచేఁ బరస్పర సంభాషణమున కవకాశము లేనివారై యుందురు. భాషల కట్టిభేదములు గలిగించు ముఖ్యకారణముల నిఁక ముందు విపులముగా నుపన్యసించెదము.

శబ్దశాస్త్రము కృషిచేయువారు ముఖ్యముగాఁ జర్చింపవలసిన యంశము లివి. ౧. భాషలకుఁ గలపరస్పరసాదృశ్యమును బరస్పరభేదములు బుట్టించిన కారణము లెవ్వి? ౨. భాష మనోవృత్తులతో నెట్లు సంబంధించినది? ౩. ఈసంబంధ మెట్లు కలిగినది? ౪. కడచిపోయినకాలమందు భాష లోకము నుండి యుత్సన్నము కాకుండ నెద్ది దానిని నిలువఁ బెట్టినది? ౫. భాష మనుష్యుల కెట్లలవడినది? ౬. మనుష్యజాతులచరిత్ర మెట్లు పెరిఁగినది? ఈయంశములు నన్నింటిని భాషాశాస్త్రమే మనకుఁ దెలియఁ జేయును. ఈభాషాశాస్త్రతత్త్వమును బూర్వు లెవ్వరు బాగుగ విమర్శించి యుండలేదు. ఇదియు రసాయనశాస్త్రము వృక్షశాస్త్రము మొదలగు వానివలె నూతనముగాఁ బ్రవృత్తమయి పందొమ్మిదవశతకమందు వెలువడినది. ఇది కొలఁదికాలముక్రిందటఁ బైకి వచ్చినను బ్రకృతము దిగ్జ్ఞానశాఖలో విమర్శకు లగుబుద్ధిమంతు లుత్సాహముతో విమర్శించుచుఁ దమవిమర్శఫలము లగుక్రొత్తవిశేషములను లోకమునఁ బ్రకాశింపఁ జేయుచున్నారు.

భాష మనుష్యులచే నేర్చుకొనఁబడినది గాని పూర్వులు సంపాదించిన సొత్తువలె వంశపరంపరాప్రాప్త మయినది కాదు.

మనకు భాష యెట్లు వచ్చినది, మాటలాడుప్రతిమనుష్యుఁడు భాష వచ్చినవాఁ డెట్లయ్యెను? ఈప్రశ్నకు సమాధానమందు భాషాశాస్త్రతత్త్వ మంతయు నిమిడియున్నది. నేర్చుకొనఁగా మనకు భాష వచ్చిన దనుప్రత్యుత్తర మీప్రశ్నకుఁ జెప్పఁజాలనివా రెవ్వ రుండ రని నానమ్మకము. మన మేకుటుంబములోఁ బుట్టితిమో యాకుటుంబజనముచే మనకు శైశవమందు భాష నేర్పఁబడును. అఱవము గాని, తెలుఁగు గాని, యాంగ్లభాష గాని, యింక మఱియే భాష గాని మాటలాడువారియిండ్లలోఁ బుట్టిన పిల్లలు చిన్నప్పుడు తమపెద్దవాండ్రు అమ్మ, అన్న, తాత, మామ యను నర్థమిచ్చు నాయాయిభాషాశబ్దములను బునరుక్తముగాఁ బలుకుచు వ్రేళ్లతో వారిని జూపించుచు నేర్పుటచే నాయాయిభాషాశబ్దములఁ గాలక్రమమున గ్రహించి నాలుగయిదుసంవత్సర

ముల ప్రాయము వచ్చునప్పటికిఁ బిల్లలా యాయిభాషల నొకరీతిగా మాటలాడఁగలవా రగుదురు. ఈవిధమునఁ బెద్దవాండ్రు చిన్నతనమందు శిశువులకు మాటలను నేర్పకపోయినయెడల వారు తప్పక మూఁగవాండ్రగుదురు. పూర్వకాలమం దమెరికాదేశపు శాస్త్రజ్ఞుఁ డొకఁడు పిల్లలకు మాట లెట్లు వచ్చునో శోధన చేయఁగోరి పేదవానిశిశువు నొకనిని సొమ్మిచ్చి పుచ్చుకొని యొకయింటిలో నుంచి నిశ్శబ్దముగాఁ బోయి యాపిల్లవానికి సర్వవిధసంరక్షణలుఁ జేయుచుఁ బెంచుచుండుఁ డని తనభృత్యుల కాజ్ఞాపించె నఁట. వారును దమప్రభు వాజ్ఞాపించినటులు కాలిచప్పుడుకూడఁ గాకుండ మౌనముతోఁ బోయి యాకుఱ్ఱనికిఁ జేయవలసినపను లన్నియుఁ జేయుచు రాఁగా వాఁ డేడెనిమిది సంవత్సరముల వయస్సుగలవాఁ డగునప్పటి కేవమూక (Deaf-mute) యయ్యె నని వార్తాపత్రికలలోఁ జదివియున్నారము. కావునఁ బిల్లలు చిన్నతనమునుండి పెద్దవాండ్రుచ్చరించు మాటలను విని పట్టుకొని నేర్చుకొందు రనునంశము నిర్వివాదము. కాబట్టి భాష మనుష్యులచే నేర్చుకొనఁబడునది. భాష మనుష్యజాతికి స్వభావసిద్ధ మయిన దనియు, శరీరవర్ణము, శరీరదార్ఢ్యము, మనోగుణములు మొదలగువానివలె మనుష్యులకు వంశపరంపరాప్రాప్య మనియుఁ గొందఱు చెప్పుదురు గాని యాపక్షము శబ్దశాస్త్రజ్ఞులచే నిరసింపఁ బడుచున్నది

పిల్లలు చిన్నతనమం దొకభాషను మాటాడ సామర్థ్యము గలవా రెట్లగుదురో యాక్రమము నిటుపైని విచారింతము. మాటలు వచ్చుటకు ముందు దశలో ననఁగా, నేడెనిమిదిమాసములయీడునఁ బిల్లలు మొదట నేర్చుకొనునది యెద్ది యనఁగాఁ దనచుట్టు నుండెడువస్తువులను మనుష్యులను జూచి గుఱుతుపట్టుట, మనుష్యులలో మనుష్యులకు వస్తువులలో వస్తువులకుఁ గల తారతమ్యముఁ గనిపెట్టుట. ఇట్లు కొంతకాలము జరిగినతరువాత "నిది తల్లి, యిది దాది, వీఁడు తండ్రి, వీఁ డన్న" యని మనుష్యులను బ్రత్యేకముగా నానవాలుపట్టి వారుచేయు పనులను గనిపెట్టుచుండును. ఇట్టియూహ పొడముచున్నసమయమునందే శబ్దముల నుచ్చరించుటకు సాధనము లగువాగుత్పాదకావయవముల (Vocal organs) నుపయోగించుటకుఁ బ్రయత్నించును. ఇట్లు కొన్నాళ్లు ప్రయత్నింపఁగాఁ గొంత తనసహజశక్తివలనను, మఱికొంత తన చుట్టుపట్టుల నుండుమనుష్యుల మాటల ననుకరించుటవలనను గ్రమక్రమముగాఁ బిల్లఁడు మాటాడ శక్తిగలవాఁ డగును. అయిదాఱుమాసములవయస్సు వచ్చువఱకుఁ బిల్లఁడు తనచేతులను గాళ్ల నూరక యాడించుచుండును. తరు

వాతఁ గొన్నాళ్లకవి పని కుపయోగించు ననుజ్ఞానము గలవాఁడై యాచేతులతోఁ వస్తువులఁ బట్టుకొనుటకుఁ బ్రారంభించును. శబ్దోచ్చారణసాధనములగునోటిలోని యవయవముల నుపయోగించుశక్తి వస్తుగ్రహణశక్తికంటెఁ గొంత విలంబముగాఁ గలుగును. మఱి కొంతకాలము గడవఁగా శిశువు చెవికి వినఁబడువానిని గంటికిఁ గనఁబడువాని ననుకరించును. మనము "అమ్మ, అక్క, అన్న" యనిచెప్పఁగాఁ బిల్లఁ డాశబ్దముల ననుకరించును. పిల్లలకు మొదట మాటలాడుశక్తి కలుగుచున్నప్పుడు కంఠ్యములు తరువాత నోష్ఠ్యములు సులభముగా నుచ్చారణకు వచ్చును. క్రమముగాఁ దక్కినయక్షరములు పలుకఁబడును. ఇదివఱకుఁ బిల్లఁ డెఱిఁగియున్న వస్తువులను వానిపేళ్లతోఁ గలుపుట క్రమముగా నేర్చుకొనును. ఈవిషయమందే మనుష్యుని శక్త్యతిశయము చూడఁబడుచున్నది. వస్తువులను వానిపేళ్లతోఁ గలుపుట పిల్లలకు మొదట సులభమయినపని కాదు. ఈపేరీవస్తువున కని యు నీవస్తు వీపేరు కల దనియుఁ బిల్లలు శీఘ్రముగా గ్రహింపలేరు. పంచదారకు దానిని దినుటవలనఁ గలుగు నానందమునకు, నుపాధ్యాయుని బెత్తమునకు దానివలనఁ గలుగుదండనకుఁ గల సంబంధ మెట్లు నేర్చుకొనఁబడునో యట్లే వస్తువులకు వానిపేళ్లకుఁ గలసంబంధమును బిల్లలు నేర్చుకొనునట్లు ప్రతిక్షణము సుస్పష్టముగాఁ బెద్దలచే నేర్పఁబడుచుండవలెను. పేరులు పెట్టి యావస్తువులఁ జెప్ప నారంభించుటకుఁ బూర్వము చాలకాలమువఱకుఁ బ్రతిశిశువును జేతులచేతనే వస్తువుల నెఱుంగుటకారంభించును. పిమ్మట నసంపూర్ణముగాను, నస్పష్టోచ్చారణతోను దఱచుగాఁ దన్నెత్తుకొని యాడించుచుండెడివారికే తెలియునట్లు గాను దనకుఁ బరిచితమయిన పేరును మాటిమాటికిఁ బలుకుచుండును. ఆదశ దాఁటినతరువాత శబ్దముల యథావస్థితస్వరూపములను దెలిసికొనుటకుఁ బ్రయత్నించును. ప్రాయికముగాఁ బిల్లలు చిన్నతనమందు వస్తువులవ్యవహారనామముల సరిగా నెఱుంగనివారై వానిగుణములనుబట్టి కాని వానిపనులనుబట్టి కాని తమయిచ్చకొలఁది నావస్తువులకుఁ బేర్లిడుదురు. చెఱకుకఱ్ఱకుఁ దియ్యకఱ్ఱ యనియు పటాకీలకు డన్‌డన్ అనియు వ్యవహరించు కొందఱుచిన్నపిల్లల నేనెఱుఁగుదును. పైని వ్రాసినయన్నిసంగతులను సావధానముగా మనము కనిపెట్టినయెడలఁ బ్రతిశిశువునందు నివి కానవచ్చును. ఈవిధముగఁ బెద్దలచేఁ బిల్లలు శిక్షితులయి భాష నేర్చుకొందు రనునంశము పూర్వోక్తములయిన యుపపత్తులచే స్థాపింపఁబడినది

శాస్త్రసంస్కారహీన మగునవస్థలో నుండు ప్రతిభాషయందుఁ దొలిని శబ్దములు, అవి తెలియఁజేయు పనులకు గుఱుతులుగా వాడుకలోనికి వచ్చినవి. ఇందు కుదాహరణముగా మనయార్యభాషనుండి కొన్నిశబ్దములఁ దీసికొందము. “మాసీ” అనుశబ్దమునకు చంద్రుఁడు, మాసము (నెల) కూడ నర్థము. ఈశబ్ద మదాదిధాతుగణములోనిది యగు “మామానే” అను ధాతువు నుండి పుట్టినది. మామి, మాసి, మాతి ఇత్యాదులు దీనిరూపములు. కావున మాసీ శబ్దమునకుఁ గొలుచునది యని మొదటియర్థము. కొలతకు సాధనమయిన దానికి మాత్ర మనియుఁ గొలతకు మాన మనియుఁ బేరు. దీనికి గ్రీకు భాషలో metron అనియు నాంగ్లేయభాషలో metre అనియు వాడుదురు. నావికుఁడు వ్యవసాయదారుఁడు పూర్వకాలమం దీమాసీశబ్దమును అహస్సులను, రాత్రులను, పక్షములను, మాసములను, ఋతువులను, అయనములను, సంవత్సరములను గొల్చువాఁ డనునర్థమందు వ్యవహరించిరి గాని యిటీవలఁ బుట్టిన కవులు

ఉ. “హాలహాలద్వయంబు కలశాంబుధిఁ బుట్టె వినీలపాండుర
జ్వాలలతోడ సం దొకవిషం బొకవేలుపు మ్రింగె నందులో
వేలుపు లోలిమై ననుభవించిన రెండవయీవిషంబు ని
ర్మూలముగాక యున్నయది ముద్దియపాంథులపాప మెట్టిదో.”
(శృంగా. నై. ౨ ఆ. ౧౨౧ ప.)

అని వర్ణించినట్లు విరహిణీబాధకుఁ డని వాడుక చేయలేదు. ఆంధ్రభాషలో నున్న “నెల” యనుశబ్ద మఱవభాషలో “తింగళ్” అనుశబ్దము పూర్వోక్తమగుమాసీశబ్దమువలెనే చంద్రునికి మాసమునకుఁ గూడ వర్తించును. యజ్ఞశరద్వర్షాదిశబ్దములు కూడ నిట్టివియే.

మొదట నేకరూపముగా నున్నభాష పిదప ననేకావాన్తరభాషలుగా విభక్త మగుటకుఁ దగినకారణ మేమో యిటు పైని విమర్శించెదము. దీనికి ముఖ్య మయినకారణము స్వరవ్యత్యయము. (Sound change) ఇందువలనఁ గాలక్రమమున రెండుభాషలు పెరిఁగి పెరిఁగి నానావిధము లగుమార్పుల నొంది యొకనియభిప్రాయ మింకొకనికిఁ దెలియకుండ వికృతి నొందును. ఒక సంఘములో నున్నకొంతమంది యొక్క యుచ్చారణరీతియే యాసంఘమువారి భాష నంతను శుద్ధముగా మార్చివేయుటకు ముఖ్యకారణము. తఱచుగా సంభాషణములో నొకమనుష్యుని యుచ్చారణ మితరుని యుచ్చారణకంటెఁ

గొంతవిజాతీయముగా నుండక మానదని మన మెఱుఁగుదుము. అట్టివిషయములో నొకసంఘమం దుండెడియందఱ యుచ్చారణ మేకరీతిగా నుండు నని మన మెట్లనుకొనఁగలము. ఇపుడు భాషాశాస్త్రచర్చకొఱకు సంఘ మనఁగా నెట్టిదియో యిచట మనము నిర్వచింపఁ దగియున్నది. తెలిసికొనుటకు శక్యము గానంత స్వల్పభేదములు గలయొకభాషను మాటాడుచుఁ దఱచుగా నొకరితో నొకరు స్నేహముతోఁ గలసిమెలసి యుండుజనుల గుంపునకు సంఘ మని పేరు. పెద్దది యగుజనసంఘమునందుఁ బ్రత్యేకముగాఁ జిన్నచిన్నగుంపు లేర్పడును. సాంఘికభావము చిన్న దైనకొలఁది దానిలోఁ జేరినమనుష్యులు దృఢసంబంధముఁ బరస్పరమైత్రియుఁ గలవారై యుందురు. సంఘము విపులముగా నున్నపుడు మనుష్యుల కన్యోన్యసంబంధము శిథిలముగా నుండక మానదు. ఎట్లన నొకతాలూకాయందుఁ గాని యొకజిల్లాయందుఁ గాని యొకపెద్దపట్టనమందుఁ గాని నివసించియుండు జనులు తదితరప్రదేశములయం దుండువారితో నేవిధమయిన సంబంధము లేనివారయి యొకరియధికారమునకు మఱియొకరు లోపడకుండ నుందురు. ఇట్టివా రందఱుఁ దాము నివసించియుండు ప్రదేశములనుబట్టియు వృత్తులనుబట్టియు నేకీభూతులయి పరస్పరమైత్రితో నుందురు. ఇట్టివారు కేవల మొకభాషను మాటాడుసంఘముగా నేర్పడుదురు. కాని వీరి యుచ్చారణములో భేదము కలుగుటయే గాక యొక్కమనుష్యుఁ డొక్కతీరున నుచ్చరించుట కిష్టముగలవాఁడై యుండును. బుద్ధిపరిణామము శరీరనిర్మాణము మొదలగునవి యట్టియుచ్చారణభేదములకు ముఖ్యహేతువులు. ఎట్లన; మంచి సత్తృశ్వశక్తి గలవాఁడు తాను మాటాడునపుడు శ్రద్ధవహించి తనకు శక్యమయినంత సౌష్ఠవముతో వర్ణముల నుచ్చరించుటకుఁ బ్రయత్నించును. మఱి కొందఱు తమకుఁ దోఁచినట్లు పలుకుదురు గాని ప్రత్యక్షరమునకు స్ఫుటత, వైశద్యము, శ్రుతిసుఖము గలుగునట్లు పలుకరు. ఈ కాలమం దాంగ్లేయపాఠశాలలోఁ బరీక్షలకు వ్యాసములను వ్రాయనభ్యసించు విద్యార్థులసంగతి యటుండనిండు. కొంతసంస్కృతభాషాసంస్కారము గలవారు సైతము శుకము, సుఖము, శీతము, సీమ, శక్తి, సక్తి, శేఖర, సేవ, శార, సార యీశబ్దములయం దున్నసకారశవర్ణములకు; రథము, పథము, రిక్థము, అశ్వత్థామ, క్రోధము, బోధ ఇత్యాదులయం దున్న థ ధ లకు; నష్టము, దృష్టి, నిష్ఠురము, శ్రేష్ఠుఁడు, బలిష్ఠము, పుష్టి మొదలగువానియం దున్నటకారఠకారములకు నిసుమంతయిన భేదము లేకుండఁ బలుకుటకు వ్రాయుటకుఁ గూడ నలవాటుపడి యున్నారు.

ఈసందర్భమునందు మఱియొకటి చెప్పవలసియున్నది. వ్యాకరణశాస్త్రజ్ఞుఁ డగు నొకపండితుఁడు తనవిద్యార్థిసమయమునందుఁ గుమారుని దగ్గఱకుఁ బిలిచి యిట్లుపదేశించె నఁట.

“యద్యపి బహునాధీషే తథాపి పఠ పుత్ర వ్యాకరణమ్।
స్వగణ శ్శ్వగణో మాభూ త్సకలం శకలం సకృత్ శకృత్.”

ఇందువలననే ప్రాతిశాఖ్యకర్తలు వేదపాఠకులు వేదమంత్రోచ్చారణమం దొనర్చు నుచ్చారణదోషము లిన్ని యున్నవని చెప్పి వానిని నిషేధించిరి.

“గ్రస్తం నిరస్త మవిలంబితం నిర్హత మంబూకృతం ధ్మాత మథోవికంపితం।
సందష్ట మేణీకృత మర్ధకం ద్రుతం వికీర్ణ మేతాస్స్వరదోషభావనాః”

౧. గ్రస్తం = జిహ్వామూలమునందు వర్ణమునడ్డుట.
౨. నిరస్తం = నిష్ఠురధ్వని.
౩. ప్రగీతం = సామవలె దీర్ఘముగాఁ బలుకుట.
౪. క్ష్విణ్ణం = వడఁకుచున్నవానివలెఁ బలుకుట.
౫. అవిలంబితం = ఇంకొకవర్ణముతోఁ గలియకుండుట.
౬. నిర్హతం = ధ్వని రూక్షముగా నుండుట.
౭. సందష్టం = వృద్ధినొందినదానివలెఁ బలుకుట.
౮. వికీర్ణం = ఇంకొకవర్ణముతోఁ గలిసి యుండుట.
౯. అంబూకృతం = లోపల గొణఁగినట్లు పలుకుట.
౧౦. అర్ధకం = దీర్ఘము నైనను హ్రస్వముగాఁ బలుకుట.
౧౧. ధ్మాతం = శ్వాసప్రాచుర్యముచే హ్రస్వమయినను దీర్ఘముగాఁ గనఁబడుట.
౧౨. ఏణీకృతం = ఇది యుకారమా లేక యొకారమా యని సందేహము పుట్టునట్లు పలుకుట.

ఇందుచేతనే పతంజలి మహాభాష్యమందు

“దుష్ట శ్శబ్ద స్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో నతదర్థ మాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రు స్స్వరతోపరాధాత్”

శబ్దము స్వరవ్యత్యాసముచేఁగాని వర్ణవ్యత్యాసముచేఁగాని తప్పుగా యజ్ఞాదికర్మలయందుఁ బ్రయోగింపఁబడినట్లయిన నది వక్తచే నుద్దేశింపఁబడిన యర్థమును దెలుపనిది యయి వాగ్వజ్ర మగు వజ్రాయుధ మగు నా యజమానుని హింసిం

చును. ఇంద్రశత్రుశబ్దము తప్పుస్వరముతో నుచ్చరింపఁబడినది యయి యజమానుని హింసించెను. ఇచట "ఇంద్రశత్రుః" అనుశబ్ద మాద్యోదాత్తస్వరముతో నుచ్చరింపఁబడినయెడల "నింద్రుని వధించువాఁడను గావలయు" నని తత్పురుషసమాసార్థమును జెప్పును. అట్లుగాక యీఋత్విక్కు, అంతోదాత్త స్వరముతో నుచ్చరించెను. అందువలననాశబ్దము తత్పురుషసమాసార్థము నిచ్చుటకు బదులుగా "నింద్రుఁడే వధించువాఁడు గాఁగలవాఁడను గావలయు" నని బహువ్రీహిసమాసార్థము నిచ్చెను.

లౌకికవైదికశబ్దానుశాసనకర్త యగుపాణిని తనకాలమునాఁటికే వర్ణాగమ వర్ణవిపర్యయ వర్ణనాశములచే వికృతి నొందిన పృషోదరాదిగణపఠితము లగు శబ్దముల నించుకంతయు సవరింపలేక "పృషోదరాదీని యథోపదిష్టమ్"(౬-౩-౧౦౯) "పృషోదరప్రకారాణి శిష్టై ర్యథోచ్చారితాని సాధూని స్యుః" పృషోదరాదిగణపఠితము లగుశబ్దములు వికృతులయినను సనాతనముగా శిష్టులచే నెట్లుచ్చరింపఁబడెనో యట్లే మనము వానిని గ్రహింపవలయు నని చెప్పెను.

ఇట్లు మనుష్యుల యుచ్చారణాసౌష్ఠవమువలనఁ బ్రతిభాషలోను శబ్దములకు వికారము కలుగక మానదు.

ఏకవిధ మయినయుచ్చారణము, నేకవిధ మయినమార్పును గలభాషలను విమర్శింపఁగా మనము పైని జెప్పినలక్షణములు గలసంఘ మనునది యొకటి యుండె ననియు దానిలోఁ జేరిన మనుష్యు లందఱు నొకరితో నొకరు స్నేహసంబంధము గలవారై యుండి రనియు స్పష్టముగాఁ జెప్పవచ్చును. ఇట్టిసంఘముయొక్క స్థితిగతులు కొన్నాళ్లకు దైవవశమున విపర్యాసముఁ బొంది సంఘములో నుండువారి స్నేహసంబంధము మునుపటివలె సాన్ద్రముగా నుండుట మాని విరళమయి క్రమముగా శైథిల్యము నొందఁగాఁ గాలక్రమమున నీపెద్ద సంఘము విభక్త మయినది యయి వేఱువేఱుగుంపు లగును. వీరికిఁ బూర్వమం దుండెడి సంబంధసాతత్యము తగ్గినకొలఁది మనుష్యులగుంపులకు భేదములు హెచ్చును. ఇట్లు మహాజనసంఘము దనలోఁదాను విభాగము నొంది ముక్కముక్కలు కాఁగా మొదట వీ రందఱుఁ గలిసి యున్నపుడు మాటలాడు భాషకూడ విభేదము నొంది కొంతకాలమున కవాంతరభాషలను బుట్టించుట కవకాశము గలిగించును. ఈవిధమునఁ బెద్దసంఘములు విభక్తములయి యనేకము లగుచిన్నసంఘములుగా నేర్పడినపు డవాంతరభాషోత్పత్తి మొదలిడెను.

ఇట్లు సంఘమును విడఁదీసి యవాంతరభాషలఁ బుట్టింపఁజాలిన భేదము నకు వీరిసంతతసహస్థితిభంగమునకుఁ గారణము లెవ్వియై యుండు నని మన మిఁక నాలోచింపవలెను.

లోకములో నుండుమనుష్యసమూహ మంతయు నీరీతిగా విభక్త మయి యుండు నని మన మూహింపనచ్చును.

౧. ఒకగృహమందు నివసించి యుండెడు నొకపెద్దకుటుంబము.

౨. అట్టియనేకకుటుంబములతోఁ గూడిన యొకగ్రామము.

౩. అనేకము లగుపెద్దగ్రామములతోను జిన్నగ్రామములతోను గూడిన యొకపరగణా.

౪. అనేకము లగుపరగణాలు, జిల్లాలు, పట్టనములు, పల్లెటూళ్లు మొదలగువానితోఁ గూడిన యొకపెద్దదేశము.

ఇట్టిదేశమందు హిందువు లనియు, మహమ్మదీయు లనియు, యూధు లనియు వ్యవహరింపఁబడు ననేకజాతులవారు నివసించియుందురు. ఇన్నితరగతులుగా నిన్నిప్రదేశములయందు నివసించియుండు నీజనసమూహములో నొకవర్గమును మఱియొకవర్గముతో వేఱుచేయుట కనేకలక్షణములు స్వభావములు కలవు. రుచులు, అలవాటులు, మనోధర్మములు, శరీరధర్మములు మొదలగునవి యొకకుటుంబములో నొకతలిదండ్రులకుఁ బుట్టినసోదరుల నైనను విభిన్నులనుగాఁ జేయును. వయస్సు స్త్రీపురుషవిభాగము గూడ నీభేదమునకుఁ గారణములు. రెండుప్రదేశములకు నడుమ నుండునరణ్యములు, పర్వతపంక్తులు, నదులు, సరస్సులు నాప్రదేశములలో నివసించుమనుష్యులను వేఱుచేయును. మతము, దేశముయొక్క శీతోష్ణస్థితి, పరిపాలకభేదము సంఘైక్యభంగమునకుఁ గారణములు. ఒకపెద్దపట్టనములో జీవించువా రైన నుద్యోగములచే జీవించువారికిని, కృషి, వాణిజ్యము, చిత్రలేఖనము, మఱికొన్నిచేతిపనులు మొదలగువానిచే బ్రతికెడివారికి నైకమత్య ముండదు. ఇట్లవాంతరభాషోత్పత్తికిఁ గారణ మయిన సంఘవిభాగమున కివియే ముఖ్యహేతువులు.

భాషలోఁ బుట్టుచున్న మార్పుల నడ్డుటకుఁ గాని యిదివఱకున్న ప్రాచీనపద్ధతులను మార్చుటకుఁ గాని మనుష్యునికి శక్యము కాదు. మనశరీరనాళములయందుఁ బ్రసరించు రక్తము నడ్డుటకు, మన కిపు డున్నపొడవుకంటె మఱికొంత హెచ్చుపొడవు సంపాదించుటకుఁ బ్రయత్నించుట యెట్టియున్మత్తప్రవృత్తియో యట్లే యొకభాషను మార్చుటకుఁ గాని లేక భాషలోనికిఁ

స్తోత్రపద్ధతులను దీసికొనివచ్చుటకుఁ గాని ప్రయత్నించుట. భాషాపద్ధతులను బాగుగ నెఱింగి వానిని మన్నించుకవీశ్వరుఁడు శబ్దశాస్త్రవేత్తయు భాష కధిపతియు నగును.

పూర్వకాలమం దొకప్పుడు టిబెరియస్ (Tiberius) అనురోమకచక్రవర్తి యొకఁ డాస్థానమందుఁ గూర్చుండి సదస్యులతో సంభాషించుచుండఁగా నవ శబ్దముఁ బ్రయోగించెను. మార్సిలస్ (Marcellus) అనువైయాకరణి వెంటనే చక్రవర్తి నాక్షేపించెను. క్యాపిటస్ (Capitus) అను మఱియొకపండితుఁడు "చక్రవర్తిని నీ వి ట్లాక్షేపింపవచ్చునా? ఆయన ప్రయోగించినది మంచి ల్యాటిన్ (Latin) శబ్దమే. ఒకవేళఁ బ్రకృతమం దది యపశబ్దమయినను నిఁకముం దది యే సుశబ్దమగు" నని పలికెను. అది విని మార్సిలస్ చక్రవర్తికిఁ గోపము వచ్చు నని కూడ లక్ష్యపెట్టక భాషాభిమానమే కలవాఁడై "క్యాపిటస్! నీ వనృతవాదివి. రాజునొద్ద నిచ్చకము లాడెడువాఁడవు. ఇతఁడు చక్రవర్తి యయిన నితనికి మను ష్యులమీఁదనే యధికారము కలదు గాని భాషపై నధికారము లే" దనెను.

సిజిస్మండు అనుజర్మనీచక్రవర్తిని గుఱించి యిట్టిదే మఱియొకకథ చెప్పఁబడి యున్నది. ఆచక్రవర్తి యొకసమయమున ధర్మసభ కగ్రాసనాధిపతి యై యుండి ల్యాటిన్ భాషలో నుపన్యసించుచు Schism అను ల్యాటిన్ పదమును స్త్రీలిం గముగాఁ బ్రయోగించెను. (Vi dete Patras ut er a dicatis schisman) "విద్వ ద్వరేణ్యులారా! ఈ ధర్మమును మనము తొలఁగఁ ద్రోయ వలయు" ననెను. అందు పై నొకసన్న్యాసి "అతఁడు దేశాధిపతి, యందు పై నీసభ కగ్రాసనాధి పతి యనికూడ సరకుగొనక 'Serenissime Rex schima est generis neutrius' ఓయి మహారాజా, నపుంసక మయిన schisma శబ్దమును దమరు స్త్రీలింగ మందుఁ బ్రయోగించిరి. ఇది తప్పు" అనెను. అందుకుఁ జక్రవర్తి కోపముచేఁ గను లెఱ్ఱచేసి "అది స్త్రీలింగము కాదని నీ కెవరు చెప్పిరి" యని పలికెను. Alexander Gallus అను సన్న్యాసి యొకఁ డనెనని సదస్యులలో నొకఁడు నుడి వెను. దానిపైఁ జక్రవర్తి యుచ్చకంఠధ్వనితో "నేను జక్రవర్తినిగదా నామాట చెల్లదా? ఒక సన్న్యాసి చెప్పినది ప్రమాణమా?" యనెను. ఇంతచర్చ జరిగి నను ఆ schisma శబ్దము నపుంసకముగానే యుండెను గాని స్త్రీలింగము కా లేదు. ప్రోటగోరస్ అను నొకగ్రీకుదేశపు పండితుఁడు గ్రీకుభాషలో లిం గము విషయమయి కొన్ని నియమముల నేర్పఱిచి వాని నాకాలమందు లోక ములోఁ బ్రవర్తింపఁ జేయఁ దలంచి హోమరు కవీశ్వరుని కావ్యములలోఁ

దప్పులఁ బట్టి నారంభించెను. కాని వానిప్రయత్నము కొనసాగ దయ్యెను. ఇపుడు మనము సంస్కృతభాషలోనున్న లింగనియమము నుల్లంఘించి భార్యార్థకములు స్త్రీలింగేతరములు నగు దారకలత్రశబ్దములను స్త్రీలింగములుగా మార్పఁ గలమా? ఉచ్చారణాసౌష్ఠవము వలన శబ్దరూపములు మాఱినట్లు శబ్దముల యర్థమందుఁగూడ మార్పు కలుగును. కాలక్రమమున నేభాషలోనయినఁ గొన్ని శబ్దములు వాడుకలోనుండి తొలఁగిపోఁగాఁ గ్రొత్తశబ్దములు వాని స్థాన మాక్రమించును. పరదేశపు రాజు లొకదేశమును జయించినపుడు జేతల భాషాశబ్దములు కొన్ని జితులభాషలోఁ గలియక మానవు. హోరాక్రమేళకాది శబ్దములు గ్రీకు భాషలోనుండి మనపూర్వులచే సంస్కృతములోనికిఁ దేఁబడినవి. గ్రీకుల లిపియను నర్థమిచ్చు యవనానీశబ్దము, వారి కిష్టవస్తువులగు యవనేష్ట (తగరము) యవనప్రియ (మిరియాలు) మొదలగు శబ్దము లంతకు మునుపు లేనివి నూతనముగాఁ గల్పింపఁబడెను. నిష్క దీనార శబ్దము లిట్టివియే (loan words). మనప్రాచీనార్యులు పైదేశములనుండి వచ్చి యీభరతఖండము నాక్రమించి నపు డాదిమనివాసులభాషనుండి వీరిభాషలో గల్లచపేట, మల్ల, గోణీ, గండ, తోరణాది శబ్దములు కలిసిన వని విమర్శకులగు పాశ్చాత్యశబ్దశాస్త్రజ్ఞుల వచనప్రామాణ్యమువలనఁ దెలియ వచ్చుచున్నది.

కాలక్రమమునఁ గొన్నిశబ్దములు వాడుకనుండి యంతరించిపోవుట, మఱికొన్ని శబ్దముల కర్థమందు వ్యత్యయము కలుగుట జరుగు నని లోఁగడఁ జెప్పియున్నాను. ఇపు డాయంశమును ఋజువుచేయుటకుఁ ఋగ్వేదభాషనుండి కొన్నిశబ్దముల నెత్తి యిచటఁ జూపించుచున్నాను.

౧. మోకీ = రాత్రి.   ౫. క్రిధిః = నుయ్యి.
౨. బుందః = బాణము.   ౬. క్షుంపం = కుక్కగొడుగు (Mush-room)
౩. బేకురా = వాక్కు.   ౭. ఖజః = కవ్వము.
౪. అగ్రుః = నది.   ౮. ప్రయః = జలము.

ఈశబ్దములు ఋగ్వేదములోఁ దప్ప లౌకికసంస్కృతములో నెచ్చటను బ్రయుక్తము లయి కానరావు.

ఈదిగువ వ్రాయఁబడిన శబ్దములు పూర్వము ఋగ్వేదభాషలో నేయర్థమందు వాడుక చేయఁబడినవో యాయర్థము మాఱి యిపుడు లౌకికసంస్కృత భాషలో (Secular language) మఱియొక యర్థమందు వాడుక చేయఁబడుచున్నవి.

| శబ్దము. | ప్రాచీనార్థము. | నవీనార్థము. |
|---|---|---|
| ౧ ఊధః | రాత్రి | ఆవుపొదుగు. |
| ౨ రజః | లోకము | ధూళి. |
| ౩. ఉపలః | మేఘము | రాయి. |
| ౪. మహీ | వాక్కు | భూమి. |
| ౫. సదనం | నీరు | ఇల్లు. |
| ౬. శచీ | కర్మ | ఇంద్రాణి. |
| ౭. గర్తః | ఇల్లు | గొయ్యి. |
| ౮. అభీశుః | బాహువు | కాంతి. |
| ౯. ఇందుః | యజ్ఞము | చంద్రుఁడు. |
| ౧౦. అధ్వా | అంతరిక్షము | మార్గము. |

ఇట్టిశబ్దము లనేకము లున్నవి. గ్రంథవిస్తరభీతిచే మచ్చునకుఁ గొన్నింటిఁ గనఁబర్చితిని.

కాళిదాసాదిమహాకవుల కాలమువఱకు సంస్కృతభాషలో జాతీయము (idiom) చక్కఁగా రక్షింపఁబడినది. అర్వాచీను లగుకవులు వ్రాసిన గ్రంథములలో జాతీయ ముపేక్షింపఁబడినది. ప్రాచీనకవుల కావ్యములలో వరివస్య, ఉపచితి, ఉపస్థాన, అర్హణ, పూజ ఇత్యాదిశబ్దములకు; చింత, శోక, దుఃఖ మొదలగుశబ్దములకు; ఆలోకన, వీక్షణ, దర్శన, నిధ్యాన, నిర్వర్ణన ఇత్యాదులకుఁ గొంతయర్థభేదముతోఁ బ్రయోగములు కానవచ్చుచున్నవి. పదునాలుగవ శతాబ్దము మొదలుకొని కవు లీశబ్దములను బర్యాయపదములుగా వాడుక చేసిరి. శుద్ధ మయిన సంస్కృతపదములు పామరజనవ్యవహారముచే స్వార్థభ్రంశితము లయి యన్యార్థమందు వాడుక చేయఁబడుచున్నవి.

౧. తటస్థుఁ డనునర్థము గలయుదాసీనశబ్దము రోషమందును,

౨. సమూహవాచి యగునికరశబ్దము సారమందును,

౩. ఔషధార్థక మగుభేషజశబ్దము దంభమందును,

౪. లోపల ననునర్థ మిచ్చు నభ్యంతరశబ్ద మాటంకమందును,

౫. చెలియలికట్ట, హద్దు ననునర్థముగల మర్యాదాశబ్దము గౌరవమందును,

౬. స్వీయుఁ డనునర్థము గలనిజశబ్దము సత్యమందును,

౭. నమ్మక మని యర్థమిచ్చు విశ్వాసశబ్దము కృతజ్ఞతాపరముగాను వాడుకచేయఁబడుచున్నవి.

ఆధునికగ్రంథకర్త లీశబ్దముల నిట్టియర్థములయందుఁ బ్రహతముగా వాడుక చేయుచున్నారు.

మొట్టమొదట నొకమహాసంఘముగా నేర్పడి యొకచోటఁ జిరకాల మేకభాషావ్యాహర్తలయి యేకవిధాచారపరాయణు లయి కలిసి యున్నమనుష్యసమూహము కాలక్రమమున నజ్ఞాతకారణములచే భిన్నసంఘీభావులయి పరస్పరము విడిపోయి చిన్నచిన్నగుంపులుగా విభక్త మగుటచే నవాంతరభాష లుత్పన్నములయిన వని శబ్దశాస్త్రజ్ఞులు (Philologists) నరజాతిబోధకశాస్త్ర వేత్తలు (Ethnologists) నూహించుచున్నా రని లోఁగడఁ జెప్పియున్నాఁడను. ఇందుకు మనయార్యులవృత్తాంతమే తగిన యుదాహరణముగా గ్రహింపవచ్చును,

---

## 2. ఆర్యు లనఁగా నెవ్వరు?

ఆర్యశబ్దము పారిభాషికపదము. దీని కర్య యని కూడ రూపాంతరము గలదు. దీనికి ఛందోఽవస్థానభాషలో (Zend Avesta) ఐర్య (Airya) అని రూపము. లౌకికసంస్కృతభాషలో నీశబ్దమునకుఁ బూజ్యుఁ డని శిష్టుఁ డని యర్థము. పూర్వకాలమం దీశబ్దము మనుష్యులలో నొకజాతివారికిఁ బే రై యుండెను. మనుస్మృతికాలమువఱకు భరతఖండములోఁ గొంతభాగమున కార్యావర్త మని (ఆర్యులు వర్తించుప్రదేశము)పేరు.

"ఆసముద్రాత్తు వై పూర్వా దాసముద్రాత్తు పశ్చిమాత్ ।
తయో రేవాంతరం గిర్యో రార్యావర్తం విదుర్బుధాః॥
(మను॥ 2అ-22 శ్లో.)

వేదవిహితకర్మలయందు, శ్రద్ధ, భక్తి, విశ్వాసము గలవా రార్యు లనియు నిందుకు విపరీతు లయి యార్యులకు శత్రువు లగువారు దస్యువులనియు దాసు లనియు ఋగ్వేదములో ననేకస్థలములయందుఁ జెప్పఁబడియున్నది.

విజానీ హ్యార్యాన్ యేచ దస్యవో బర్హిష్మతే రంధయాశాస దవ్రతాన్।
శాకీభవ యజమానస్య చోదితా విశ్వేత్తా తేసధమాదేషు చాకన॥
I—51-8.

టీక॥ ఓయింద్రుఁడా! ఎవ రార్యులో, ఎవరు వారికి శత్రువులగు దస్యువులో వారిని దెలిసికొనుము. కర్మశూన్యు లయిన యాదస్యువులను యజమా

మునివశము నొందింపుము. దుష్టులను శాసించువాఁడవు శక్తియుక్తుఁడవు నగు నీవు యజమానునికిఁ బ్రేరకుఁడవు కమ్ము. నీ వొనర్చిన కర్మముల నన్నింటిని యజ్ఞములయందు స్తుతించుటకుఁ గోరుచున్నాను.

అయమేమి విచాకశద్విచిన్వన్ దాసమార్యం।
పిబామి పాకసుత్వనోఽభిధీర మచాకశం విశ్వస్మా దింద్ర ఉత్తరః॥
10—86-19.

టీక॥ యజమానులను జూచుచు దాసుని నార్యుని వేఱుచేయుచు నేను యజ్ఞముకడకుఁ బోవుచున్నాను. హవిస్సులను వండువాఁడు సోమమును బిండు వాఁడు నగుయజమానుని సోమమును ద్రాగుచున్నాను. బుద్ధిమంతుఁ డగు యజమానుని జూచుచున్నాను. ఇంద్రుఁడ నైన నే నందఱికంటె గొప్ప వాఁడను.

దేవత లార్యుని రక్షించెద రనియు వానిశత్రువు లగుదస్యువులను నశింపఁ జేయుదు రనియుఁ గొన్నిఋక్కులలో నున్నది.

అహామత్కంకవయే శిశ్నథం హన్తైరహం కుత్సమావమాభి రూతిభిః।
అహంశుష్ణస్య శ్నధితావధర్యమం నయోరరఆర్యం నామదస్యవే॥
X—49-3.

టీక॥ సుఖము కోఱ కాచ్ఛాదించుశత్రుపుత్రుని యాయుధములచేఁ గొట్టితిని. ఇట్టి రక్షణలచేఁ గుత్సుఁడను ఋషిని రక్షించితిని. శుష్ణుఁడను రాక్షసునిఁ జంపితిని. ఆర్యుఁడను పూజ్యనామమును దస్యువున కియ్యలేదు.

సజాతూభర్మా శ్రద్దధాన ఓజః పురోవిభింద న్నచర ద్విదాసీః।
విద్వాన్వజ్రిన్ దస్యవే హేతిమస్యార్యం సహోవర్ధయా ద్యుమ్నమింద్ర॥
I—103-3.

టీక॥ ఇంద్రుఁడు దస్యుసంబంధమైన పురములను భేదించుచుఁ దిరిగెను. వజ్రముగలవాఁడు విద్వాంసుఁడునగు నోయింద్రుఁడా! స్తుతిఁ జేయువాని శత్రువునికొఱ కాయుధమును విసరుము. ఆర్యుని బలమును యశస్సును వృద్ధినొందింపుము.

ఆర్యు లనునొకజాతివా రున్నట్లు వారు దేవతోపాసకు లయి యున్నట్లు వారిశత్రువు లగువారు దస్యువు లని వ్యవహరింపఁబడినట్లు పై నుదహరింపఁ బడిన ఋగ్వేదమంత్రములచే స్పష్ట మగుచున్నది.

శ్రీరస్తు.

# గోపాలునిరామకవి నన్నయభట్టారకుని వంశకవియా?

చిత్రాంగదాపరిణయ మనునొక చిత్రప్రబంధము నొనరించినవాఁ డనఁబడు గోపాలునిరామకవి యనునతఁడు నన్నయభట్టారకునివంశకవి యగునా కాఁడా యనునూత్నవిచార మొకటి యీనడుమ బయలుదేఱఁదీయఁబడినది. అవు నని కొందఱును గాఁ డని మఱికొందఱును వ్రాసినపిమ్మట నుభయవాదములను బరిశీలించి చూచి కాఁ డనువాదమునే స్థిరీకరించుచు నేనొకవ్యాసమును వ్రాసి యాంధ్రపత్రికానుబంధ మగు రౌద్రిసంవత్సరపు టుగాదిసంచికలోఁ బ్రకటించితిని. దానిపైఁ బ్రతివిమర్శనము నొకదానిని వ్రాసి మహారాజశ్రీ కర్లపాలెపు వేంకటనారాయణప్పగారు దుర్మతిసంవత్సరపు టుగాదిసంచికలోఁ బ్రచురించిరి. అందులకు వారియెడ నేనెంతయుఁ గృతజ్ఞుఁడనై యున్నాను గాని వారివ్యాసము బహువిషయములలోఁ జదువరులఁ బెడదారులఁ బెట్టఁ బ్రయత్నించుచున్న దని తెల్పవలసివచ్చినందులకుఁ జాల విచారముగా నున్నది. ఆ హేతువుచే వారివ్యాసము నిందు విమర్శించుచున్నాను. శ్రీనారాయణప్పగారు తమవాదమును నిలుపుకొనుటకై రెండపూర్వసిద్ధాంతములను గావించిరి!

(౧) "గోపాలునిరామకవి తాను నన్నయభట్టారకునివంశజుఁడ ననివ్రాసికొని గ్రంథమందు బాహాటముగా నుద్ఘోషించుచుండగాఁ బ్రమాణశూన్యముగాఁ గా దని చెప్పుటకు నెవరికి నేమి యధికార మున్నది?"

* * * * * * * *

(౨) "రామకవి తాను నన్నయభట్టారకుని వంశజుఁడ నని ఢక్కా గొట్టి చెప్పుచుండఁగా మఱియొకరు ప్రమాణరహిత మైనవాక్యములతోఁ గాదుకాదు అనిచెప్పుట ఇంటివాఁడు పాడిగేదె యనఁగ బయటివాఁడు గొడ్డుగేదె యనిన ట్లున్నది."

ఇది వట్టి యసమంజసపువ్రాఁత. ఒకఁడు తా నొకవంశమువాఁడ నని చెప్పుకొనినంతమాత్రముచేతనే యయ్యది సిద్ధాంతము కానేరదు. ఆచెప్పుకొనుటలో బహుకారణములచే నసత్య ముండవచ్చును. అట్టిస్థితిలో నాతఁడు బాహాటముగా ఢక్కా గొట్టి చెప్పుకొనినను నద్దానిని ప్రాజ్ఞులు నమ్మరు. ఇందున

కుదాహరణముల నిదివఱకే నాపూర్వవ్యాసమున నిచ్చియున్నాను, వానిని శ్రీనారాయణప్పగారు చూచుకొనలేదు. కాన మరల నెఱుకపఱుచుచున్నాను.

(౧) నెల్లుట్లవారు తాము బమ్మెరపోతనవంశమువార మని చెప్పుకొనుచున్నారు. అందుకు వీరేశలింగముగారొప్పక ఖండనమును వ్రాసి నెల్లుట్లవారు బమ్మెరవారివంశమువారు కారనిరి.

(౨) సీమంతినీకళ్యాణగ్రంథకర్త యగు పెనుమళ్ల సోమనాథకవి తనగ్రంథములోఁ బిల్లలమఱ్ఱి పినవీరన దనవంశస్థుఁడని బాహాటముగా నుద్ఘోషించెఁగాని కీర్తిశేషులైనపోలవరసంస్థానాధిపతులు కె. ఆర్. వి. కృష్ణారావు బహద్దరుగారు మున్నగువారు దానిని ఖండించివైచిరి.

వీనిం బట్టిచూడ "అన్యపురుషుని మూలపురుషునిగాఁ జెప్పుకొందురా" యని శ్రీనారాయణప్పగారు వేసిన ప్రశ్నకుఁ 'జెప్పుకొనువారుందు' రనుసమాధానము వచ్చుచున్నది.

(3) ఇంకను గోపరాజు రామప్రధాని తమవంశమువాఁడని నియోగిశాఖాబ్రాహ్మణు లగుగోపరాజువారు తలంచుచుండఁగాఁ దమవంశమువాఁడని గోలకొండవ్యాపారిబ్రాహ్మణు లగుగోపరాజువారు తలంచుచున్నారు. ఉభయులును గూడఁ బరంపరాగతమై సంప్రదాయసిద్ధమైన పెద్దలవాక్యములను బట్టియే యట్లు తలంచుచున్నారు. అన్యపురుషుని మూలపురుషునిగాఁ జెప్పుకొనువా రుండరు. తమమూలపురుషుని మఱచి పోవువా రంతకంటె నుండరు అను శ్రీనారాయణప్పగారి న్యాయము ననుసరించిన నుభయశాఖలవారి తలంపులునుగూడ గ్రాహ్యములే యగునుగదా! అట్లగుచో నొక్కపురుషుఁడే రెండుభిన్నవంశములలో నేకకాలమున నెట్లు పుట్టఁగలఁడు?

ఇట్టి యుదాహరణము లనేకములు కలవు. గ్రంథవిస్తరభీతిచే నింతటితోఁ గట్టిపెట్టుచున్నాను. అన్యపురుషునిఁ దమవంశస్థునిగాఁ జెప్పుకొనువారు లేకపోలేదు. అందు కనేకకారణము లుండవచ్చును. ఆస్తియందలి యాశచేఁ 'నంగర మాతాత, బ్రహ్మోజీ మీతాత' యనువా రుండవచ్చును. కీర్తికాములై గొప్పవారిని దమవంశస్థులనుగాఁ జెప్పుకొను బాదరాయణసంబంధముఁ జూపువా రుండవచ్చును. కేవలభ్రమచే నట్లు తలఁచువారు నుండవచ్చును. నామగోత్రాదులం దొకింత సామ్య ముండుటం గని భ్రమసి యొకవంశస్థుని మఱియొకవంశస్థునిఁగా మనవారు భావించుకొనుట కలదు. పై సోమనాథకవి తాను భరద్వాజగోత్రుఁడైనను గశ్యపాన్వయుఁడగుపిల్లలమఱ్ఱి పినవీరన తన

వంశమువాఁడని భ్రమించె. ఎందుచేత? నియోగులలో భరద్వాజగోత్రు లగు పిల్లలమఱ్ఱివారు కలరు. *పిల్లలమఱ్ఱి యనునింటిపేరుంగని పినవీరన భరద్వాజస గోత్రుఁడైయుండు నని భ్రమపడి యట్లువ్రాసె. గోత్రసామ్య ముండుటచే నెల్లు ట్లవారు తాము బమ్మెరవార మనుకొనఁ జొచ్చిరి. భ్రమ లీరీతిగా లోకములో వ్యాపించును. ఇంతయేల? మన శ్రీ నారాయణప్పగారే యీ వివాదాంశ మునుగూర్చి వ్రాయునపుడే యిట్టిప్రమాదముల కనేకములకు లోనైరి. ఎట్లన:—

౧. కావ్యప్రకాశకు "బాలచిత్తానురంజని" యను వ్యాఖ్య వ్రాసిన నరహరిశాస్త్రి తాను మల్లినాథునిపుత్త్రుఁడని వ్రాసికొనియె. అది గని మన శ్రీనారాయణప్పగా రీమల్లినాథుఁడు పంచకావ్యములకు వ్యాఖ్యానమువ్రాసిన మల్లినాథుఁడే యని భ్రమపడి తమవ్యాసములో నట్లువ్రాసిరి. ఇది యసత్యము. ఈవిషయమై పండితు లిదివఱకు బాగుగాఁ గావ్యప్రకాశ పీఠికయందును రఘు వంశ పీఠికయందును జర్చించియేయున్నారు. నరహరిశాస్త్రితండ్రి యగుమల్లి నాథుఁడు శ్రీవత్సగోత్రజుఁడు. పంచకావ్యవ్యాఖ్యాతయగు మల్లినాథుఁడు కాశ్యపగోత్రజుఁడు. మొదటివానిపుత్త్రులు నారాయణశాస్త్రియు నరహరి శాస్త్రియు. రెండవవానిపుత్త్రులు పెద్దిభట్టును గుమారస్వామి సోమయాజు లును. ఇట్టిభేదము లనేకములు కలవు. అయినను స్థూలదృష్టిచే వీనిని వేనిని జూచుకొనక శ్రీనారాయణప్పగా రుభయుల నొక్కటిచేసిరి.

౨. భాస్కరనామసామ్యముం బట్టి తిక్కనతాత యగుభాస్కరుఁడు భాస్కరరామాయణమును విరచించినట్లు వీరు వ్రాసిరి. అది వట్టిభ్రమ. నావ్రాసిన భాస్కరోదంతమును వీరేశలింగముగా రిటీవలవ్రాసిన కవులచరిత్ర మును జూచుకొనిన నీభ్రమ వీడఁగలదు.

3. పాతూరివారు తిక్కన వంశస్థులని శ్రీ నారాయణప్పగారు వ్రాసిరి. ఇది యు భ్రమగానే కాన్పించుచున్నది. ఈ విషయమై ముందు వివరముగా వ్రాసె దను. ఇది తావు కాదు కాన నిందు విడుచుచున్నాఁడను. ఇట్టి వనేకములు కలవు. ఎట్లయిననేమి యన్యపురుషుని మూలపురుషునిగాఁ జెప్పుకొనువారు గలరు. అట్లు చెప్పుకొనువారు కవులందే పల్వురు గలరు. అట్టివారి వ్రాఁతలఁ బండితులు ఖండించివైచుటయును గలదు. కాన శ్రీనారాయణప్పగారివాద మసంగతము.

కారణము లేకుండ నొకరుచెప్పినదానిని ఖండించివేయవచ్చునా యని శ్రీనారాయణప్పగారు ప్రశ్నించిరి. అట్లు చేయఁగూడ దనుమాట నిజము; బుద్ధికలవా రెవరును నొకఁడు చెప్పినదానిని గారణములేకుండ ఖండించి

వేయురు. అట్లు చేసిన నది ఖండనమును గాదు. కారణము లేకయే రామ కవి వ్రాఁత యనఁబడుదానిని నస్మదాదులము ఖండించి యుండలేదు. మాకుఁ గల కారణములను మేము తెల్పియే యుంటిమి. కాని శ్రీనారాయణప్పగారి రెండవయుపసిద్ధాంతము వారిని సత్యము తెలిసికొననిచ్చినది గాదు. వీరు తేల్చిన రెండవయుపసిద్ధాంత మేదన:—

"శ్రీకృష్ణదేవరాయలకాలమునకు పూర్వము ఆంధ్రకవు లందరును నియోగులే!" అని శ్రీనారాయణప్పగారు సిద్ధాంతీకరించిరి! ఇది పెద్దవింత సిద్ధాంతము? కృష్ణదేవరాయనికాలమునకుఁ బూర్వమునం దున్నకవు లందఱు నియోగులే యగుదురా? ఇది వట్టి పిచ్చినమ్మకముతో వ్రాసినవ్రాఁత. నియోగులు వ్రాసినవ్రాఁతలను బట్టి చూచినను నంతకుఁ బూర్వమునందు నియోగులు కానివారు పల్వురు కవులై కావ్యములు వ్రాసినట్లు కాన్పించుచున్నది చదువరుల యుపయోగార్థమై యట్టికవుల నామములను వారివంశముల నావంశములం గూర్చి వ్రాసిన నియోగుల నామములను నీక్రింద నిచ్చుచున్నాను.

| కవి. | వంశము. | తీర్పరి. | |
|---|---|---|---|
| నన్నయభట్టు | వైదికబ్రాహ్మణుఁడు | కందుకూరి వీరేశలింగముగారు. | |
| అథర్వణాచార్యులు | జైనుఁడు | శ్రీవంగూరి సుబ్బారావుగారు. | |
| నన్నెచోళుఁడు | క్షత్రియుఁడు | కందుకూరి వీరేశలింగముగారు. | |
| సుమతి | జైనుఁడు | శ్రీవంగూరి సుబ్బారావుగారు. | |
| ప్రతాపరుద్రుఁడు | క్షత్రియుఁడు | కందుకూరి వీరేశలింగముగారు. | |
| బద్దెన | ,, | ,, | ,, |
| రంగనాథుఁడు | క్షత్రియుఁడో రెడ్డియో | ,, | ,, |
| కాచవిభుఁడు | ,, | ,, | ,, |
| విఠ్ఠలరాజు | ,, | ,, | ,, |
| మాళిక్కి భాస్కరుఁడు | వైదికుఁడు కావలెను | ,, | ,, |
| మల్లికార్జునభట్టు | ,, | ,, | ,, |
| నాచనసోముఁడు | ,, | శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు. | |
| ఈశ్వరభట్ట ఫణిభట్టు | ,, | కందుకూరి వీరేశలింగముగారు. | |
| వేమన | రెడ్డికులజుఁడు | శ్రీవంగూరి సుబ్బారావుగారు. | |
| పిల్లలమఱ్ఱి పినవీరన | వైదికుఁడు | కే. ఆర్. వి. కృష్ణారావుబహద్దరు. | |
| తిక్కభూతి | క్షత్రియుఁడు | శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు. | |

ఇందఱు నియోగులు కానికవులు శ్రీకృష్ణదేవరాయలకుఁ బూర్వము నందుఁ గలరు. ఇది సంపూర్ణమగు పట్టిక కాలేదు. అందులోఁ గొందఱిని గూర్చి వివాద ముండవచ్చును. ఈశ్వరభట్టుఫణిభట్టు మున్నగువారిం గూర్చి వివాదమే లేదు. ఇంకను నీనడిమికవులను మఱికొందఱిని వీరేశలింగముగారు తమ కవుల చరిత్రములో నిచ్చిరి గాని వారివంశములను గూర్చి వా రేమియును వ్రాయలేదు. ఆకవు లెవరన?—(౧) రావిపాటి తిప్పనార్యుడు, (౨) మఃశిమంచి భట్టు, (౩) చిమ్మపూడి యమరేశ్వరుఁడు, (౪) కవిభల్లటుఁడు, (౫) కవిరాక్షసుఁడు, (౬) అయ్యలార్యుఁడు, (౭) పాలకురికి సోమనార్యుఁడు, (౮) మేధావిభట్టు, (౯) బడబానలభట్టును నైయుండిరి. వీరేశలింగముగారు పైకవు లేవంశస్థులో చెప్పలేదు గాని భట్టశబ్దకలితులు వైదికులై యుందు రని వ్రాసిరి. కావున మణిమంచిభట్టు, మేధావిభట్టు, బడబానలభట్టు వైదికులు కావచ్చును. ఇట్టిస్థితిలోఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వమం దున్న తెలుఁగుకవు లెల్లరు నియోగులే యనుట మహాసాహసము కాకుండునా? న్యాయముచే మన నియోగులు నియోగికవు లనివ్రాసిన తిక్కనాదులు కూడ నియోగు లగుదురా కారా యను విచారము కావింపవలసియున్నది. ఆంధ్రకవులచరిత్రమును మొట్టమొదట వ్రాసిన కావలి రామస్వామిగారు "డక్కను పొయిట్సు" అను గ్రంథములోఁ దిక్కనాదులను నియోగు లని వ్రాయలేదు. ఆతనిచే నియోగులుగా నెన్నఁబడిన వారు చాల తక్కువగా నున్నారు. రాను రాను నియోగీకరణము హెచ్చయిపోయినది. మన నియోగులు కొందఱు వైదికకవులనుగూడ నియోగు లని వ్రాయుటయే గాక క్రిందిజాతులవారిని గూడ నియోగులను జేయుచువచ్చిరి. బోగము కులజుఁడైన చేమకూర వేంకటకవిని గూడ నియోగిని జేసివైచి రని పోలవరము సంస్థానాధిపతులు వ్రాసియుండిరి. ఈనియోగీకరణములోఁ జాలనేర్పు చూపినవారు కం. వీరేశలింగముగారు. వీరి నియోగీకరణమును శ్రీవంగూరి సుబ్బారావుగారుకూడ సేవగించుకొనిరి. వీరినిగూడ మించిపోయి యిప్పుడు శ్రీనారాయణప్పగారు కృష్ణదేవరాయలకుఁ బూర్వమునం దున్నకవు లందఱు నియోగులే యని ఢంకాకొట్టఁ బ్రారంభించిరి. నన్నెచోడాదు లందఱు నియోగులే యైపోవుచున్నారు కాఁబోలును. మే మొక్క బ్రాహ్మణకవులను గూర్చి మాత్రమే ముచ్చటించితి మందురా కృష్ణదేవరాయలకుఁ బూర్వమునందు వైదికకవులును గలరనుటకు ననేకదృష్టాంతములు పైపట్టికవలనఁ గాన్పించుచున్నవి. అది యసంభవ మందురా క్షత్రియకవు లుండుటయు

శూద్రకవు లుండుట యు సంభవము కాఁగా విద్యానిలయు లగు వైదికులలోఁ గవు లుండుట యసంభవ మగునా? ఒక్కఁడైన నుండఁడా? ఇది యసంగతము గు నను భయము శ్రీనారాయణప్పగారికిఁ గలదు. కావున భంగ్యంతరమును బ్రొక్కిరి. "కొండవీటి రెడ్లప్రభుత్వమునకుఁ బూర్వము ఆంధ్రబ్రాహ్మణులంద ఱును నియోగులే!!" ఆకారణమున వైదికకవులు లేరంటి మని తేల్చిరి. ఇది యన్నిటిని మించినవింత. ఆంధ్రదేశములోఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వము నియోగులే కాని వైదికులు లేనే లేరఁట. ఆంధ్రవైదికులు కృష్ణదేవరాయల యనంతరమునందు నియోగుల నుండి విడిపోయి రంట, ఇది శ్రీనారాయణప్ప గారి వ్రాఁతవైఖరి. ఇవి యసంగతపువ్రాఁత లని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. బ్రాహ్మణునిప్రధానలక్షణము వైదికత. అది తరువాత వచ్చిన దనుట విపరీతము. ఈయంశమును బాలుఁడైన గ్రహింపఁగలఁడు. చరిత్రాభిజ్ఞు లగువారు నన్నయ భట్టారకునికిఁ బూర్వమునుండియును గూడ వైదికనియోగిభేదము కల దని యొప్పుకొని యున్నారు. శ్రీనారాయణప్పగారు "ఆంధ్రకవు లందఱు నియో గులే! ఆంధ్రబ్రాహ్మణు లందఱును నియోగులే!!" అని వాక్యాంతమున నా శ్చర్యార్థకచిహ్నములను వేయుచును వచ్చిరి. ఈచిహ్నములంబట్టి శ్రీనారా యణప్పగారి వ్రాఁతలు తమకే యాశ్చర్యమును గలిగించుచున్న వని బోధపడు చున్నది. ఇట్టి విపరీతాభిప్రాయము గలవా రేమివ్రాసినను వ్రాయఁగలవారే. కవులందఱు నియోగులే యను నెత్తిపట్టు పట్టి కూర్చుండినవారికిఁ దదితరకవు లును గల రని మనముచెప్పు యుక్తులు నచ్చునెట్లు? మనవ్రాఁతలు కారణో పేతము లని వారు తలంచు టెట్లు?

రామకవి వ్రాసినది నిరాక్షేపమైన దే యగు నెడల ఆంధ్రపత్త్రికాసంపా దకులు శ్రీమదున్నవలక్ష్మీనారాయణపంతులుగారు గోపాలునిరామకవి నన్నయ భట్టారకుని వంశకవి యని వ్రాసిన వ్యాసమును సిద్ధార్థిసంవత్సరపు టుగాది సంచికలోఁ బ్రచురించుచు మహాపరివర్తనమను తమసంపాదకీయవ్యాసములో "గ్రంథకర్త కేవలము గౌరవముకొఱకు నన్నయభట్టారకుని వంశము ననుసంధా నము చేసెనో నన్నభట్టారకుని వంశజుఁడో పండితులు గ్రంథకాలమును బట్టి విమర్శించి నిర్ణయించుట సమంజసము." అనివ్రాయుటకుఁ గత మేమి? ఛంకా కొట్టి రామకవి తాను నన్నయవంశజుఁడ నన పీ రిట్లు శంకింప నేల? మఱియును శ్రీలక్ష్మీనారాయణపంతులుగారివ్యాసమును బల్వురు ఖండింప నేల? శ్రీలక్ష్మీ నారాయణగారి వ్యాసము బయటఁబడుటకుఁ బూర్వమే శ్రీయవటపల్లి నారా

యణరావుగారు ముం దెప్పుడో ప్రకటింపఁబడు వ్యాసముపై వ్యాఖ్యానము లేల వ్రాయవలసివచ్చె? ఇవి యన్నియును గన రామకవివ్రాఁత శంక కవకాశము చాలఁ గలిగించుచున్న దని తేలుచున్నది. రామకవివ్రాఁతను నమ్ముటకు నవకాశము లేకుండుటకుఁ గలకారణముల ననేకముల నేను నావ్యాసములో సుస్పష్టముగా వ్రాసియున్నాను. నన్నయభట్టారకునకును రామకవికిని గుల గోత్రాదులందే భేదము కల దని నేను జూపియున్నాను. నేను జూపినభేద మద్దమునవలె స్పష్టముగా బాలురకుఁ గూడఁ గాన్పించుస్థితిలో నుండఁగా దానిని దముకుయుక్తులచేఁ గళంకితముచేసి లోకప్రతారణము చేయ శ్రీనారాయణప్ప గారు పాల్పడిరి. ఆసందర్భము నంతను నిందు మరల వివరముగాఁ జూపుచున్నాఁడను. ప్రధానాంశము గోత్రము కాన దానిం గూర్చి చర్చించినఁ జాలును.

నన్నయభట్టారకుఁడు తాను ముద్గలగోత్రజాతుఁడ నని భారత పీఠికలో వ్రాసికొనియున్నాఁడు. రామకవి యన్ననో తాను మౌద్గల్యగోత్రజుఁడనని తన చిత్రాంగదాపరిణయములో లిఖించుకొనినాఁడు. ముద్గలగోత్రము వేఱు, మౌద్గల్యగోత్రము వేఱును నైయున్నవి. ఇందుకుఁ బ్రమాణముగా నిదివఱకు శబ్దకల్పద్రుమమును, ధర్మప్రవృత్తిని జూపియున్నాను. నావ్రాసిన దానిని సరిగ ఖండింపఁజాలక శ్రీనారాయణప్పగారు మోసపువ్రాఁతలు వ్రాసి లోకమును భ్రమింపఁజేయఁ బ్రయత్నించుచున్నారు. లోకములో మౌద్గల్యగోత్రమే కాని ముద్గలగోత్రము లేనే లేదని వీరు సాహసించి వ్రాసిరి. వీరిమోసపువ్రాఁత నీక్రిందనిచ్చుచున్నాఁడను.

ధర్మప్రవృత్తిం గూర్చి వీ రిట్లు వ్రాసిరి:—

"శాస్త్రులుగా రుదహరించిన ధర్మప్రవృత్తిలోనుగూడ మౌద్గల్యగోత్ర మొక్కటే కాని ముద్గలగోత్రముయొక్క పేరే లేదట"

"లేదట" యనుటచే వీరాధర్మప్రవృత్తి నొక్కసారి చూచుశ్రమనైనఁ దీసికొనక, యెవరో చెప్పినదానిని నమ్మి యీసాహసపువ్రాఁత వ్రాసినా రనిబోధ పడుచున్నది. ధర్మప్రవృత్తిలో గోత్రప్రవరనిర్ణయము చేయుసందర్భములో, 1895-వ (సంIIలో బరూరు త్యాగరాయశాస్త్రులవారిచే స్వకీయగీర్వాణభాషా రత్నాకరముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినదానిలో) 178-వ పుటలో నిట్లున్నది:—

"అథముద్గలః—ముద్గలశ్చ త్రివేదీచ తార్క్ష్యో భార్మ్యాశ్వ ఏవచ మౌద్గ లశ్చేతి పంచైతే ముద్గలస్యగణర్షయః."

ధర్మాధికారి చక్రవర్త్యయ్యంగారి మహీశూరపురీ మధ్యవిరాజమాన విద్యాతరంగిణ్యాఖ్యస్వీయముద్రాశాలయందు సన్ ౧౯౦౪-౪-౧౭ లో నచ్చుపడిన దానిలో నిట్లున్నది. "అథముద్గలగణః—ముద్గలశ్చ త్రివేదీచ తార్క్ష్యో భార్మ్యాశ్వఏవచ మౌద్గలశ్చేతి పంచైతే ముద్గలస్య గణర్షయః.

ఇందులో ముద్గలుఁడును దదపత్యమగు మౌద్గలుఁడును వేఱుగఁగాన్పించుట లేదా? ఇఁక మౌద్గల్యుఁ డొక్కఁడే కాన్పించుచున్నాఁ డని శ్రీనారాయణప్పగారు వ్రాసినవ్రాఁత యందు సత్య మెట్లుండఁగలదు?

శబ్దకల్పద్రుమము:—శబ్దకల్పద్రుమములో నీరెండుగోత్రములును భిన్నముగా నున్నట్లు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. అం దిట్లున్నది: "ముద్గలః—గోత్రకారకమునివిశేషః; మౌద్గల్యః=ముద్గలమునిపుత్త్రః, సచ గోత్రకారకః"

ఈనిఘంటువును గూర్చి నేను నావ్యాసములో వివరముగ వ్రాసియున్నాను. శ్రీనారాయణప్పగారు మాత్ర మీగ్రంథప్రశంసయే వదలి వేసిరి. అంతటితోఁ బోనీయక "అందులో గొంత నాదియుఁ గలుపుడు" అను నాంధ్రోక్తి ననుసరించి ప్రయత్నవిశేషమున ముద్గలగోత్ర మౌద్గల్యగోత్ర భేదమును నేను గలిగించినట్లు వ్రాసిరి! నాది యేదియు నందుఁ గలుపలేదు. నేను బ్రమాణముగా నిచ్చినది శబ్దకల్పద్రుమము. తాము చూచుకొనినది వాచస్పత్యము. అందులో నాచెప్పిన పదములు లేవు. అది గని కాఁబోలు శ్రీనారాయణప్పగారు పై యాక్షేపమును గావించిరి! ఇఁక "ముద్గలః—గోత్రకారకమునివిశేషః—మౌద్గల్యః=సచ గోత్రకారకః" అనునది ఖండిత మెట్లయినది? కాలేదు. దానిని నిరసించుటకుఁ గాఁబోలు "సచగోత్రకారః గోత్రకారకమునివిశేషః." అను తూలసదృశపదద్వంద్వమునే నమ్మితి"ననిరి! నే నుదాహరించినవి తూలసదృశపదద్వంద్వములఁట! తాము పలుకుపలుకులు తూలసదృశములుగాక వాతూలసదృశములు కాఁబోలును! పిచ్చివ్రాఁతలకు శ్రీనారాయణప్పగారు గడంగిరి. ఏపదములందును గూడ బరువుండదు కాని వానిభావములు మాత్రము సరిగఁ దెలిసికొనిన మంచిగౌరవ ముండు నని శ్రీనారాయణప్పగారు తెలిసికొనవలెను.

వాచస్పత్యముంగూర్చి:—వాచస్పత్యమునందు "ముద్గలః—గోత్రప్రకర్షే మునిభేదే" యని యున్నదని శ్రీనారాయణప్పగారి శాస్త్రులవారు వ్రాసిరి! నారాయణప్పగారివలెనే వారి శాస్త్రులవారుకూడ గ్రంథమును జూడలేదు కాఁబోలు! ఏమన:—అందు "గోత్రప్రవరర్షౌమునిభేదే"యని యున్నగా నిదివారు తలంచినట్లు "గోత్రప్రకర్షే ముని భేదే" యనిలేదు. గోత్రప్రవరర్షౌ మునిభేదే

యన ముద్గలగోత్రము కలదని స్పష్ట మగుచున్నది. అది బయల్పడిపోవు నను భయముచేతఁ గాఁబోలును గ్రంథస్థపదములను దిద్దివేసి గోత్రప్రకర్షే మునిభేదే యని వాక్యమును విపరీతస్థితిలోనికిఁ దెచ్చిరి. ఇది శ్రీనారాయణప్పగారి తప్పో వారి శాస్త్రులవారితప్పో తెలియదు.

నిర్ణయసింధువుంగూర్చి — నిర్ణయసింధువు మున్నగు నిబంధన గ్రంథము లన్నియు మౌద్గల్యగోత్రముం గూర్చి ముచ్చటించుచున్నవి గాని ముద్గల గోత్రముం గూర్చి ముచ్చటించుట లేదని వీరు వ్రాసిరి. ఇదియును నసత్యమే. నిర్ణయసింధుకారుఁడు "అథముద్గలాః" అని ముద్గలగోత్రమును గూర్చి మాత్రమే ముచ్చటించెను గాని "అథమౌద్గలాః" అని వ్రాసియుండ లేదు.

ఇట్లు శ్రీనారాయణప్పగారు సాహసించి యసత్యపువ్రాఁతలఁ జాల వ్రాసి వ్రాసి తుదకు మౌద్గల్యగోత్రమే కాని ముద్గలగోత్రమనునది యొకటి లే దనిరి.

ముద్గలగోత్రము లేదా?—లోకమునందును శాస్త్రములందును మౌద్గల్య గోత్రమే కాని ముద్గలగోత్రము లేనిచో నన్నయభట్టోపాధ్యాయసార్వభౌముఁ డు తనది మౌద్గల్యగోత్ర మనక ముద్గలగోత్రము (ముద్గలగోత్రజాతు)అని చెప్పుకొనునా? అతఁడు మౌద్గల్యగోత్రమే కాని ముద్గలగోత్రము వేఱుగా లేదని యెఱుంగఁడా! అతఁడు తప్పువ్రాసె నని యే శ్రీనారాయణప్పగారు తేల్చిరి! నన్నపార్యుఁడు సహజపాండిత్యము కలవాఁడఁట! అందుమూలముచే మౌద్గల్యగోత్రమే కాని ముద్గలగోత్రము లేకున్నను ముద్గలగోత్రజాతుఁడ నని వ్రాసికొనె నఁట! వారిసాహసోక్తుల నీక్రింద నిచ్చుచున్నాను:—

"ముద్గలమౌద్గల్యపదములను ప్రాచీనకవులు సహజపాండితీకవితా విశే షజ్ఞులు గాన సామాన్యముగా ప్రయోగించినారు"

సహజపాండితీవిశేషజ్ఞులు సరియగుపదములను వాడరు కాఁబోలు! ఇది పెద్దవింత! వీరేశలింగముగారు పోతనంగూర్చి వ్రాయుచు "సహజపాండిత్యుఁ డగుటచేత నీతనికవిత్వమునం దక్కడక్కడ గొన్నివ్యాకరణాది దోషములు కానవచ్చుచున్నవి" అని లిఖించిరి. ఆగమనిక ననుసరించి వీరును సహజపాండి త్యుఁ డగుటచే నన్నయ మౌద్గల్యపదమును వాడుటకు మాఱుగా ముద్గల పదము వాడె నని లిఖించిరి. సహజపాండిత్య మెట్టిదైనను నన్నయ గురుకుల వాసముచేసి శ్రమపడి విద్యనభ్యసించినవాఁడు గాని సహజపాండిత్యమాత్రము కలవాఁడు గాఁడు. నారాయణభట్టును నితఁడును సతీర్థు లని భారతము

ఘోషించుచున్నది. నన్నయ వ్రాసినదానియందుఁ దప్పునులేదు. సమస్తగ్రంథములును ముద్గలగోత్రముంగూర్చి ముచ్చటించుచునే యున్నవి. కొన్ని గ్రంథములంగూర్చి పై నిదివఱకే వ్రాసియున్నాను. అందులో శ్రీనారాయణప్పగారు పరమప్రమాణముగాఁ దీసికొనిన వాచస్పత్యమునందే ముద్గలుఁడు గోత్రప్రవరర్షియని తెల్పఁబడియున్న దని కనఁబఱిచినాను. ఇంకను మఱికొన్ని యుదాహరణముల నిచ్చెదను. సంస్కారకౌస్తుభములో "ముద్గలాః" అని ముద్గలగోత్రమును గూర్చి ముచ్చటింపఁబడియున్నది.

సుబలచంద్రమిత్రునిచే సంకలితము చేయఁబడిన "సరళబంగాశాభిధాన" మను వంగభాషానిఘంటురాజములో "ముద్గల = గోత్ర కారకమునివిశేష, పుష్పవృక్షవిశేష, నృపవిశేష" అని వ్రాయఁబడియున్నది. గోత్రప్రవరనిర్ణయములో "అథ ముద్గలానాం త్ర్యార్షేయ ఆంగీరస భార్మ్యాశ్వ మౌద్గల్యేతి" అని యుండఁగా దానికిఁ డీకాకారు లిట్లు టీక వ్రాసిరి "అథ = అనంతరము; ముద్గలానాం = ముద్గలగోత్రికులకు; త్ర్యార్షేయ = ముగ్గురుఋషులుగలప్రవరము" ఇట్టి వనేకములు గలవు కావున శాస్త్రములంబట్టి ముద్గలగోత్రము లేకపోలేదు. లోకములో ముద్గలగోత్రము కల దని నన్నయభట్టారకుని వ్రాఁతయే తెల్పుచున్నది.

శంకరాదులవాక్యములంగూర్చి:—శ్రీనారాయణప్పగారు ప్రౌఢతమిూఱ నావ్రాసినది శ్రీశంకరాదుల మతమునకే విరుద్ధముగా నున్నట్లును శ్రీశంకరాదులు మౌద్గల్యగోత్రమే కాని ముద్గలగోత్రము లేదని నట్లును లోకమును భ్రమపెట్టనెంచి యెవరో ధర్మశాస్త్రములను సమగ్రముగాఁ బరిశీలించిన యొకశాస్త్రులవారి వాక్యజాలము లని యీక్రింది సంస్కృతవాక్యములను దమ వ్యాసములోఁ బొందుపఱిచిరి.

"శ్రీశంకరభాష్యే తైత్తిరీయోపనిషది శిక్షావల్యాం, అష్టమేనువాకే పురుశిష్టస్యాపత్యం పౌరుశిష్టిః, రథీతరస్య గోత్రాపత్యం = రాథీతరః; ముద్గలస్యాపత్యం,=మౌద్గల్యః, తత్త్రైవ శంకరానందయతిః భగవతో మాధవాచార్యస్య గురుః, స్వకృతదీపికాయాం ముద్గలస్య అపత్యం=మౌద్గల్యః, వాచస్పతి నిఘంటుః ౪౭౫౭ పేజీముద్గలః, గోత్రప్రవర్తకే మునిభేదే ౪౦౬౬ పేజీ మౌద్గల్యః, ముద్గలస్యమునేః గోత్రాపత్యం ముద్గలగోత్రాపత్యే మునిభేదే ఇత్థం వాచస్పత్యాం వాచస్పతిభి ర్గదితం"

నేనువాడిన "తూలసదృశపదద్వంద్వము"ను నెగురఁగొట్టుటకై శ్రీనారా

యణప్పగారి శాస్త్రులవారు ప్రయోగించిన యీవాతూలసదృశసంస్కృతపద జాలము సందర్భరహితమై వట్టిగాలిమాటల మూటగా నున్నది. శ్రీశంకరా నందులవాక్యము లనునవి ప్రస్తుతవిషయమగుగోత్ర ప్రవరలతో సంబంధించినవే కావు. కావున ముద్గలమౌద్గల్య గోత్రవివాదమున కింతయు నక్కఱకు రావు. శిక్షావల్లిలో నొకసందర్భమున "మౌద్గల్య" పదము వచ్చియుండుటచే శ్రీశంకరభగవత్పాదులవా రాశబ్దముంగూర్చి కొంత వ్రాసిరి. ఆమౌద్గల్యపదము శిక్షావల్లిలో 9-వ యనువాకమున నున్నది గాని శ్రీనారాయణప్పగారి శాస్త్రులవారు చెప్పినట్లు 8-వ యను వాకములోన లేదు. నేను శిక్షావల్లిప్రతులను నాగరలిపియం దున్నవానిని నాంధ్రలిపియం దున్నవానిని గూడఁ బెక్కింటిని జూచియుంటిని. అన్నిటియందును నీవాక్యములు 9-వ యనువాకమునందే కాన్పించుచున్నవి. ఈసందర్భముం బట్టిచూడ వీరిశాస్త్రులవారు పూర్వాపరములు బాగుగాఁ జూచుకొనియును వివాదాంశమేదో తెలిసికొనియును వైగీర్వాణమును బ్రయోగించినట్లు తోఁచుటలేదు. ఇంకను శ్రీశంకరభగవత్పాదులవారి భాష్యపంక్తుల నిచట నీయక తమవాక్యములనే శ్రీశంకరవాక్యము లనుగా నిచ్చిరి. పూర్వాపరసందర్భములు బాగుగాఁ దెలియఁగలందులకై మూలమును దచ్ఛంకరభాష్యమును నీక్రింద నిచ్చుచున్నాను.

"మూ. సత్యమితి సత్యవచారాథీతరః । తపఇతి తపోనిత్యః పౌరుశిష్టిః । స్వాధ్యాయప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః ।"

"శం॥ భా॥ సత్యమితి = సత్యమే వానుష్ఠేయ మితి, సత్యవచాః = సత్యమేవ వచో యస్య సోయం సత్యవచాః, నామవా తస్య; రాథీతరః = రథీతరగోత్రః, రాథీతర ఆచార్యో మన్యతే; తప ఇతి = తప ఏవ కర్తవ్య మితి, తపోనిత్యః = తపసి నిత్యః, తపఃపరః తపోనిత్యఇతివా నామ; పౌరుశిష్టిః = పురుశిష్టస్యాపత్యం, పౌరుశిష్టిరాచార్యోమన్యతే; స్వాధ్యాయప్రవచనే ఏ వానుష్ఠేయే ఇతి నాకోనామతః, ముద్గలస్యాపత్యం మౌద్గల్య ఆచార్యో మన్యతే.

సత్యమే యనుష్ఠేయ మని సత్య వచస్కుఁ డగురాథీతరుఁడు చెప్పె. తపమే యనుష్ఠేయ మని తపోనిత్యుఁ డగుపౌరుశిష్టి పలికె, స్వాధ్యాయప్రవచనములే ముఖ్యానుష్ఠేయము లని మౌద్గల్యుఁ డగునాకుఁడు వచించె నని మూలము చెప్పుచున్నది. ఈసందర్భములో మౌద్గల్యపదము మూలమునందు రాఁగా ముద్గలాపత్యము మౌద్గల్యుఁ డని శ్రీ శంకరభగవత్పాదులవారు వ్రాసిరి. ఇందులో గోత్రప్రశంస యేమున్నది? శ్రీ శంకరభగవత్పాదులవారి వ్రాత

వలన నేమి తేలుచున్నది? మౌద్గల్యుఁడు ముద్గలాపత్య మని తేలుచున్నది. అంతియ, ఇది ప్రతిపక్షుల కేమిలాభము కలిగించునో తెలియనచ్చుటలేదు. ఇందు గోత్రములప్రసంగ మేది? ఏదియును లేదు. ముద్గలాపత్యమే మౌద్గల్యుఁడని నావ్యాసములో నేను మొదటనే వ్రాసియున్నాను. శ్రీశంకరులవారు వ్రాసినదానికి భిన్నముగా నేనును వ్రాసియుండలేదు. నేను వ్రాసినదానిని సరిగఁ జూచుకొనక శ్రీనారాయణప్పగారు "ప్రమాణపదవియం దగ్రపూజ్యులగు శ్రీశంకరాది మహాశయుల యభిప్రాయములను ముద్గల మౌద్గల్యశబ్దములకు ఇచ్చిన నిర్వచనాదులను గమనింపలే" దని నన్నధిక్షేపించిరి; ఇది పెద్ద మోసము. నేను శ్రీశంకరులవారు వ్రాసినదాని కనుగుణముగానే వ్రాసియున్నాను. శ్రీశంకరులవారి యభిప్రాయమును దుర్వినియోగముచేసి పూజ్యపాదులయెడల నపచార మొనరించినవారు మనశ్రీనారాయణప్పగారే కాని నేను గాను.

ఇఁక శ్రీనారాయణప్పగారి శాస్త్రులవారు వాచస్పత్యముంగూర్చి వ్రాసిన యామహావాతూలసదృశ పదజాల మంతయుఁ దప్పని యిదివఱకే ఋజువుచేసియున్నాను.

ఈరీతిగా శ్రీనారాయణప్పగారు గాని వారిశాస్త్రులవారు గాని విషయమునకు సందర్భించిన సంగతి యొకటియును వ్రాయలేదు. అన్నియును మోసపువ్రాఁతలే వ్రాసిరి.

శ్రీనారాయణప్పగారిభ్రమ:—వీ రొకభ్రమకు లోనైనట్లు తోఁచుచున్నది. ముద్గలాపత్యమే కదా మౌద్గల్యుఁడు. అట్టిస్థితిలోఁ దండ్రికొడుకుల యిద్దఱినడుమను గోత్రభేద మెట్లువచ్చు నని వీరి యాశయము కాఁబోలు! అందుకే కాఁబోలును శ్రీనారాయణప్పగా రిట్లు వ్రాసిరి:—

"ఋషిభేదము స్పష్టముగాఁ గనుపించుచుండినను వీ రుభయులు తండ్రికుమారు లని సామాన్యస్ఫురణ మగు అర్థమును పరిత్యజించి స్వాభీష్టసిద్ధికై గోత్రభేదమును పామరులకు శబ్దభేదము, . అనఁగా ముద్గలమౌద్గల్యశబ్దముల కీషత్తు భేద మున్నందున .... ప్రయత్నవిశేషమున ముద్గలగోత్రజుఁడు మౌద్గల్యగోత్రజుఁడును ఒకఁడె ట్లగు నని.....బ్రహ్మయ్యశాస్త్రులుగారు దృఢపరుచుకొనినారు."

సామాన్యముగా లోకములోఁ దండ్రి గోత్రమును గొడుకు గోత్రమును నొక్కటి యగుచుండును. అంతమాత్రముచే గోత్రకారకఋషుల పితాపు

త్రాది సంబంధమునుబట్టి గోత్రమొక్కటియే యగునని తలంపరాదు. అట్లు తలంచుట పెద్దభ్రమ. ఏమనఁ దండ్రియును గోత్రకారకుఁడు కావచ్చును. కొడుకును గోత్రకారకుఁడు కావచ్చును. అప్పు డవి రెండును భిన్నగోత్రముల గును. ఇందు కుదాహరణముల నిదివఱకే నా మొదటివ్యాసములో నిచ్చియున్నాను. ఆయంశమును శ్రీనారాయణప్పగారు తిన్నఁగఁ జూచుకొనలేదు, గాన మరల వివరముగా వ్రాయుచున్నాను. వసిష్ఠుని గోత్రాపత్యమే వాసిష్ఠుఁ డైనను లోకములో వసిష్ఠగోత్రము వేఱుగను వాసిష్ఠగోత్రము వేఱుగను నున్నవి. వసిష్ఠగోత్రప్రవర వేఱు వాసిష్ఠగోత్రప్రవర వేఱు నై యున్నవి. ఇంకను వసిష్ఠుని మనుమఁడే పరాశరుఁడు. అయినను వసిష్ఠగోత్రము వేఱుగను బరాశరగోత్రము వేఱుగ ను గలవు. ఇంతకంటె వింత యగువిశేషము గోత్రసందర్భమునఁ గలదు. కౌశికుఁడే విశ్వామిత్రుఁడు. అయినను కౌశికగోత్రము వేఱుగను విశ్వామిత్రగోత్రము వేఱుగను నున్నవి. కావున ముద్గలమౌద్గల్యులు తండ్రియును గొడుకును నైనను ముద్గలగోత్రమే మౌద్గల్యగోత్రము కావలసిన యవసరము లేదు. ముద్గలుఁడే మౌద్గల్యుఁ డనుకొందు మన ముద్గలమౌద్గల్యులలో ఋషిభేదము కాన్పించుచున్న దని ప్రతిపక్షులే యంగీకరించిరి. ముద్గలమౌద్గల్యగోత్రభేదమును గాన్పించుచున్నది. ముద్గలగోత్రాపత్యము మౌద్గల్యుఁడు గాని ముద్గలానంతరాపత్యము మౌద్గల్యుఁడు కాఁడు. అయినను నిప్పు డావిచారముతోఁ బనిలేదు. లోకములో వసిష్ఠగోత్రము వేఱు. వాసిష్ఠగోత్రము వేఱు. పరాశరగోత్రము వేఱును నైనట్లే ముద్గల గోత్రము వేఱు మౌద్గల్యగోత్రము వేఱును నైయున్నవి. అట్టివి లోకములోఁ గలవు.

శ్రీనారాయణప్పగారి కిఁకనొక భ్రమ కలిగిన ట్లున్నది. అది యేది యనః—ప్రవరోచ్చారణసమయమున, నేశబ్దము లుచ్చరింపఁబడునో యాశబ్దములే గోత్రనామము లగునని వీరు భ్రమసిన ట్లున్నది. ఇది తప్పు. కొన్ని ప్రవరలలో గోత్రర్షినామమే యుండదు. కపిగోత్రాదిక మిందుల కుదాహరణము. ఇందులకునై యెచటికోఁ బో నేల? ముద్గలగోత్రములం గూర్చియే ముచ్చటించుకొందము. అత్రిగణములోఁ జేరిన ముద్గలగోత్రప్రవర నిర్ణయసింధువులో "ఆత్రేయార్చనానసపౌర్వాతిథ" అని యున్నది. ఇందులో ముద్గల పదము లేనంతమాత్రమున నయ్యది ముద్గలగోత్రము కాకపోవునా? మనము ప్రవరోచ్చారణము చేయునప్పు డార్షేయమును జెప్పుదుము. అనఁగా ఋషి సంబంధమును జెప్పుదుము. భరద్వాజగోత్రులు "భారద్వాజ" అని చెప్పుకొం

దురు. వసిష్ఠగోత్రులు "వాసిష్ఠ" అని చెప్పుకొందురు. పరాశరగోత్రులు "పారాశర" అనియు విశ్వామిత్రగోత్రులు "వైశ్వామిత్ర" అనియుఁ జెప్పుకొందురు. అంతమాత్రముచే వారు భారద్వాజగోత్రులు, వాసిష్ఠగోత్రులు. పారాశరగోత్రులు కానేరరు. ఈయంశమున శ్రీనారాయణప్పగారి వ్రాతయే తెల్పుచున్నది. ఎట్లన వా రిట్లు తమవ్యాసాంతమున లిఖించిరి.

"రుద్రాభట్ల వెంకప్పసోమయాజులుగారు విశ్వామిత్రగోత్రీకుఁడు గదా. విశ్వామిత్రునియింటిపేరు రుద్రాభట్లవా రయ్యెందురా? పుల్లంరాజు వేంకటేశ్వరరావు పంతులుగారిది పరాశరగోత్రము గదా. పరాశరునియింటిపేరు పుల్లంరాజువా రా?

ప్రవరోచ్చారణసమయమందు "వైశ్వామిత్ర" "పారాశర్య" అనియే యిన్నినిబంధనగ్రంథములును జెప్పుచున్నవి గాని "విశ్వామిత్ర" "పరాశర" అని యేవియును జెప్పుట లేదే. శ్రీనారాయణప్పగారు రుద్రాభట్లవారు విశ్వామిత్రగోత్రు లనియుఁ బుల్లంరాజువారు పరాశరగోత్రులనియు నెట్లు చెప్పిరో? ఈవిధముగా శ్రీనారాయణప్పగారు తెలిసియుండియుఁ గువాదము నకు దిగిరి. కావునఁ బ్రవరోచ్చారణసమయము నందు "మౌద్గల్య" అని నంతన గోత్రమును మౌద్గల్యగోత్రమే యని తెల్పరాదు.

పూర్ణబోధకారికలు.—పూర్ణబోధకారికలలో నీభేదము స్పష్టముగాఁ దెల్పఁబడియున్నది. అందు ముద్గలగోత్రము విహూపగణమునందును మౌద్గల్యగోత్రము మౌద్గల్యగణమునందును నీఁబడియున్నవి. అంతియకాక ముద్గలగోత్రులకును మౌద్గల్యగోత్రులకును వివాహము పనికిరా దని కూడఁ దెల్పఁబడియున్నది. ఆవాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

శ్లో॥ విహూపోష్ఠా దంష్ట్రనామా పృషదశ్వశ్చ ముద్గలః
చతుర్గోత్రం విహూపస్య నాన్యోన్యం పాణిపీడనం॥
శ్లో॥ మౌద్గల్య తార్క్ష్యభార్మ్యాశ్వత్రీణిగోత్రాణ్యమూనివై
మౌద్గల్యస్య గణస్త స్మిన్ నవివాహః పరస్పరమ్॥
శ్లో॥ మౌద్గల్యాఖ్య గణస్యాపి విహూపస్య గణస్యచ
మౌద్గల్య ముద్గలాభ్యాంచ నవివాహః పరస్పరమ్॥

ఈవిధముగా ననేకగ్రంథములు గోత్రప్రవరలను దెల్పవలసివచ్చినప్పుడు ముద్గలగోత్రము వే అనియు మౌద్గల్యగోత్రము వే అనియుఁ దెల్పుచున్నవి.

కావున ముద్గలగోత్రము వేఱనియు మౌద్గల్యగోత్రము వేఱనియు

శాస్త్రములే తెల్పుచున్నవి. నన్నయభట్టారకుఁడు తాను ముద్గలగోత్ర జాతుఁడ నని వ్రాసికొని నాఁడు. అది సహజపాండిత్యముచే శాస్త్రము తెలియక వ్రాసినదికాదు. శాస్త్రీయమే. ఇఁక నేను తూలసదృశము లగు ముద్గలమౌద్గల్యశబ్దములందుఁ గలభేదమును బట్టి మాత్రమే గోత్రములు వే అనలే దనియు శాస్త్రము ననుసరించియే యంటి ననియుఁ జదువరులు గ్రహిం చుకొందురు గాక.

రామకవి ప్రవరోచ్చారణసమయమునందుఁ గాక తన మూలపురుషుని దెల్పుటలోనే యనఁగా గోత్రర్షిని దెల్పుటలోనే మౌద్గల్యుని దెల్పుకొని నాఁడు. కాన నాతఁడు మౌద్గల్యగోత్రుఁడు.

కాఁబట్టి నన్నయభట్టారకుఁడును రామకవియు నేకగోత్రమువారు కారు. భిన్నగోత్రులు. ఒకవంశమువారు కారు. ఇంక నొకవిషయము మాత్రము తెల్పి దీని నింతటితోఁ గట్టిపెట్టుచున్నాఁడను.

నన్నయ పిల్లలమఱ్ఱి పినవీరన వంశస్థుఁడు కాఁడా?—గోత్రశాఖాదులను దెల్పుటలో నియోగీకరణమునకుఁ గడంగిన మనవారు బహువిచిత్రములఁ గావించిరి. కావించుచున్నారు. కావింపఁగలరు. గురుజాడ శ్రీరామమూర్తి పంతులవారు నన్నయను నియోగిని జేయనెంచుకొనిన వారిలో మొదటివారు. అప్పటికిఁ బాపము రామకవి గ్రంథము లేదు. ఆహేతువుచే వారు మార్గాం తరమును ద్రొక్కిరి. పిల్లలమఱ్ఱి పినవీరన తనగ్రంథములోఁ గవిస్తుతి యొన రించుచు "మానన్నయభ"ట్టని వ్రాసె. దాని నాధారముగాఁ దీసికొని నన్నయ భట్టు పిల్లలమఱ్ఱి పినవీరనవంశమువాఁ డనియు నాతనిది భారద్వాజగోత్ర మనియు శ్రీరామమూర్తిగారు సాహసించి వ్రాసిరి కనుఁడు:—

"పినవీరభద్రయ్య గోత్రవిషయము:—దీనిం గూర్చి పినవీరభద్రకవి వలన నేమియుఁ జెప్పఁబడదయ్యెను. కాని యతఁ డాంధ్రకవులం గూర్చి వర్ణిం చుచు వ్రాసిన పద్యమువలన నీతనిగోత్ర మూహింపఁదగి యున్నది. ఎట్లన్నను?

"   *   *   *   * భా

రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్"

"మా"అనుదానింబట్టి చూడ నన్నయభట్టును బినవీరన యొక్కవంశము వారు నొక్కగోత్రమువారై యుందు రనియుఁ జెప్ప నొప్పియున్నది. నన్నయ భట్టు గోత్రము భారద్వాజసగోత్రము, కావునఁ బినవీరనగోత్రమును అదియే యని యూహింపనైయున్నది.

దీనింబట్టి నన్నయయింటిపేరు పిల్లలమఱ్ఱివా రనియు గోత్రము భారద్వాజగోత్ర మనియుఁ దేలినవి. పాపము శ్రీరామమూర్తిగారింతటితో నన్నయను బూర్తిగా నియోగిని జేసి వేసితి మనుకొనిరి. కాని యిటీవలి నియోగులు దీని నంగీకరించుటకు వలనుపడుట లేదు. ఇటీవలఁ బిల్లలమఱ్ఱి పినవీరన వైదికుఁడని నియోగులే కొందఱు వ్రాసిరి. అది యటులుండ నీతఁడు తనశకుంతలాపరిణయములోఁ దాను గాశ్యపగోత్రుఁడ నని వ్రాసికొనియె. కాన శ్రీరామమూర్తిగారి వ్రాఁత యింతయు నిలుపడాయె. నన్నయభట్టారకునిది ముద్గలగోత్రము. పినవీరనది కాశ్యపగోత్రము. నియోగీకరణార్థమై శ్రీరామమూర్తిగారు నన్నయను బినవీరనను గూడ నద్భుతముగా భారద్వాజగోత్రులను జేసిరి. భారద్వాజగోత్ర మని యేల చెప్పవలసివచ్చిన దనిన నియోగిశాఖలోని పిల్లలమఱ్ఱివారు భరద్వాజగోత్రులు. ఆహేతువుచే నియోగీకరణార్థమై శ్రీరామమూర్తిగారు పినవీరననే కాక నన్నయభట్టారకునిగూడ నీగోత్రములోనికి లాగిరి. సీమంతినీకల్యాణగ్రంథకర్త యగు పెనుమళ్ల సోమనాథకవి గూడఁ బినవీరనను భరద్వాజగోత్రములోనికి లాగినాఁడు. గృహనామసామ్యముం గని భ్రమపడి యాతఁ డట్లు చేసినాఁడు. ఇఁక సోమనాథకవి వ్రాసినయసంగతపు వ్రాఁతను నిలువఁబెట్టనెంచి శ్రీ వంగూరి సుబ్బారావుగారు భరద్వాజునకే కాశ్యపుఁడను పే రున్న దనుకొనుమన సాహసించిరి. చూచితిరా నియోగీకరణధురీణత యేవిధముగా నడచుచున్నదో? భరద్వాజునకే కాశ్యపుఁ డను పే రున్నదనుకొనినఁ జాలదు. శ్రీరామమూర్తిగారిని నిలువఁబెట్టుటకై ముద్గలునకుఁ గూడ భరద్వాజుఁ డనుపేరున్న దనవలెను. ఇంతయేల తెలుఁగుకవులందఱును నియోగులే యను పిచ్చినమ్మకమును నొకదానిని మనసునం దిడుకొని మనవారు కొందఱు వెఱ్ఱిపనులను జాలఁ జేయుచున్నారు. నన్నయ్యది శ్రీరామమూర్తిగారు తలఁచినట్లుగా భారద్వాజగోత్రముగాదు. నారాయణప్పగారు తలఁచినట్లుగా మౌద్గల్యగోత్రముగాదు. ఇతనిది ముద్గలగోత్రము. మౌద్గల్యగోత్రులును భరద్వాజగోత్రులు నీతనివంశమువారు కారు.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

శ్రీరస్తు.

# రేఫద్వయవాదనిరాసము.

---

కం. అల రేఫద్వయవాదము, నెలకొని యిందు రసమహితనిర్మలకవితా
లలనాప్రచారపదశ్రీం, ఖలమైయుండుట విచారకలనం దోఁపన్. ౧

వ. తత్ప్రకారం బంతయు సలక్షణంబుగ నరయందలంచి. ౨

చం. అరయ ద్విరేఫచుంచువుల కయ్యెనొ యాంధ్రపదప్రపంచమం
దిరవుగఁ గొన్నిరేఫములు హేమసుమంబులు వాని నెల్ల నే
ర్పెర శకటంబులం దిడి వడిం జనుదెంచిరి చాటువాక్యసుం
దరకవితారమావిలసనంబునకుం దెరువడ్డగింపఁగన్. ౩

తే. కాన రేఫకుశకటమెక్కడిదొ తెలుఁగు, బాసయందుఁదన్మూల మేర్పడ నెరుంగు
టది యవశ్యకమగుటనీయర్థమందు, నించుక విచార మిట నొనరించవలయు.

సూ॥ "లఘువోలఘువశ్చేతి ద్వేధాంతస్థాన్ విదంతి శాస్త్రారః
అన్యేష్వన్యవ్యాకరణే స్పష్టా రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః॥
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్॥"

"నన్నయభట్టీయము."

కం. మును నన్నయభట్టీయం, బున సూత్రము లునికి నిదియె మూలము గాఁగన్
జనియించెన్ రేఫద్వయ, ఘనవాదము నేఁటికిని దెగనితం పగుచున్. ౪

కం. కలిగెడి నంతస్థములకు, నలఘుత్వలఘుత్వభేద మందు యవలలన్
గల దన్యశాస్త్రవిధి యీ, తెలుఁగున రేఫకు ఘటిల్లు ద్వివిధత యనుచున్. ౫

సూ॥ "వ్యోర్లఘు ప్రయత్నతర శ్శాకటాయనస్య॥
పదాన్తయో ర్వకారయకారయో ర్లఘూచ్చారణౌ వయా వాస్తోశిపరే॥"

"పాణినీయసూత్రము."

సూ॥ "లోళః పైశాచ్యాం॥ లకారస్యాలఘూచ్చారణే ళకారస్యాత్॥"

"వాల్మీకిప్రాకృతవ్యాకరణసూత్రము."

తే. తథ్యముగ వ్యోర్లఘుప్రయత్నతరయనుచుఁ
బాణినీయసూత్రమున యవలకు దివిజ
భాష నలఘులఘుత్వవిభాగ ముదిత
మయ్యె నుచ్చారణవిభేద మగుటకతన. ౬

తే. ప్రాకృతవ్యాకరణమునఁ బరఁగులోళ
యనెడుసూత్రమ్మున లకారమలఘులఘువి
భేదసిద్ధివహించె నీభేదమమర
భాషయందును సిద్ధమై పరఁగుచుండె. ౮

తే. అవ్విధముననె యవలల కాంధ్రమందు, లఘ్వలఘు భేదసిద్ధి కల్ప్యముగఁ జెప్పి
యిందు రేఫకు నలఘుత్వమిష్టమనుచుఁ, జెప్పనిది సంస్కృతమునం దసిద్ధమగుట.

సూ॥ "రోరి॥ రేఫస్య. రేఫే పరే లోపస్స్యాత్॥
ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోణః ఢరేఫౌ లోపయతీతితథా తస్మిన్ నన్తే అర్థా
ద్ఢకార రేఫాత్మకే పరే పూర్వస్యాణోదీర్ఘస్స్యాత్ పునారమతే హరీ
రమ్యః శంభూ రాజతీ॥"

"పాణినీయసూత్రములు."

ఉ. రోరి యటన్నసూత్రము ఢ్రలోప యనంగల సూత్రముల్ వచో
ధోరణి రాకురా గదియఁ దూకొనులోపముఁ బూర్వదీర్ఘముల్
వారక నిర్ణయించు సురవాక్కుల రాకును ద్విత్వహీనమై
నీరసముం బునారతి ధ్వనీరమతే యనఁగల్గురూపముల్. ౧౦

కం. అలసురభాషను రాకుం, గలుగదు ద్విత్వంబు ముజ్జగంబుల యందుం
దెలుఁగున రేఫకు ద్విత్వము,గలదుగదా మఱ్ఱి యిఱ్ఱి కఱ్ఱి యనంగన్.

కం. కావున రేఫకు నలఘు,త్వావస్థానమ్ము తెలుఁగునందుం గలుగన్
ద్వైవిధ్యము రస్వత్రయ,నా విధిసూత్రము వచించె నన్నయభట్టున్. ౧౨

కం. యవలల కలఘులఘుగతులఁ, దవులదు పలుకుబడిభేదదర్శన మిది రా
కు వలనుగాదు ద్విత్వము,గవగొన నుచ్చారణమునఁ గడును గలుగుటన్.

కం. ఆ రేఫద్వయమున కు,చ్చారణభేదంబునందుఁ జను వైధర్మ్యం
బ్బారసిరయోస్తునిత్యము, నారూఢిన్ సూత్రకల్పనం బొనరించెన్. ౧౪

ఆ. అట్లుగాక రేఫ కాకృతిభేదంబు, లేదు ప్రాసములకు రాదు లఘువు
కలఘు రేఫ యనుట యగు జడ్డవర్ణంబు, నొంటివర్ణమునకు నొనరమిఁ జూడి.

సూ॥ "ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు దశోనాస్యుః
షట్త్రింశదత్ర తే చాన్యేచానుప్రవింశతి శబ్దయోగవశాత్॥"

సూ॥ "ద్వివిధా దిదుదేతోచో వక్రతమా చాప్యనుస్వారా
కగచజయుగటడణతదనపబమయరలవశసహాళంతుహాల్వర్గః
అద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర స్స్యా న్నిథ స్సవర్ణస్య॥

తే. అచ్చు లవి పదునాల్గు స్పర్శాక్షరములు
పదియు నేను నంతస్థము ల్బరఁగు నాల్గు
సహాళములు మూఁడుఁ గూడ నచ్చ తెనుఁగునకు
ముప్పదియునారు వర్ణము ల్గొనయుచుండు. ౧౬
కం. చజలకును దంత్య తాల, వ్యజనిత భేదమ్ము గలుగ వర్ణాంతరయు
క్తి జరుగఁ జెప్పి రేఫకు, నిజమగు భేదంబు గలిగెనేనిఁ దెలుపఁడే. ౧౭
వ. అట్లు గావున ౧౮
తే. ద్విత్వయుక్తంబుగానిచోఁ దెలుఁగుపలుకు, లందలఘు రేఫకలుగఁబో దెందు నేని
యట్లుఁగాక ద్విరేఫనియమము సత్య, మేని తద్భేద మెరుఁగంగ నెవరితరము.
తే. చజలకును దంత్య తాలవ్య సంజ్ఞ దెలియ, నత్తుపైనున్న దంత్యమం చనివిధించి
రేఫయుగ్మవిధాయకక్రియకు సూత్ర, కల్పనము సేయఁడే శాస్త్రకర్త యందు.
కం. ఇల శకట రేఫయనుచుం, బలుకుదు రాయలఘు రేఫ బండి యెచటిదో
కలిగించిరి రాకెక్కఁగ, బలుసంపన్ను లగునాంధ్రపండితవర్యుల్. ౨౧
కం. ఏపదముల శకటంబో, యేపదముల సాదురాయో యిదమిద్ధమనం
జూపట్టునె విధి యొక్కటి, యేపగిదిం దెలియవచ్చు నీభేదంబుల్. ౨౨
కం. అరిగెనన సాదురాయన, నరచుట యన శకట రేఫ మన విధి యెట్లో
సరియే కద యుచ్చారణ, మరయఁగ నెట్టు లగుఁ దద్వయవిభేదంబుల్. ౨౩
కం. తెలుఁగుపదంబులు రేఫము, గలిగిన యవి సంస్కృతంబుఁ గలుపక ప్రాసం
బుల నిలిపిన యవి శకటం,బు లటంచు వచించి రదియుఁ బొసఁగకపోయెన్.
కం. ఒకపదమె యొకటఁ దెనుఁగున, కొకచో సంస్కృతపదమున కొగిఁ బ్రాసంబై
ప్రకటమయిన నుభయం బని, యొకతడకను నడ్డువెట్టె గొప్పునె యటులన్.
కం. అతివైధర్మ్యము రాకుం, బ్రతిపన్నంబైన నొక్క పదమున నదిసం
గతమై యొకపరి శకట, స్థితమై యొకమాటు డిగి రుచించుట తగునే. ౨౬
కం. ఒకపదమునఁ గల రేఫం, బొకమా టొకబండి నెక్కి యొకమాటు డిగన్
దికమకయై యడుగునఁ బడి, యకటా బోరగిలఁబడునొ యాబండి కడున్.
వ. అట్లగుటకుఁ దార్కాణ చూపెద.

౧ తిరుగు + తిఱుగు.

రేఫయగుటకు - ఆదిపర్వము.

చం. తిరిగెడుపుట్టలం బొదలఁ ద్రిమ్మరుపాముల రోసిరోసి ని
ష్ఠురభుజదీర్ఘదండమున డొల్లగ వ్రేయుచు . . .

శకటరేఫయగుటకు - స్త్రీపర్వము.

గీ. తిఱిగి పొగులంగ నేపటి నెఱియ మనల.

౨ తొఱఁగు + తొరగు.

రేఫయగుటకు - ఆశ్రమవాసపర్వము.

కం. హరిజనములు కన్నీళులు, దొరఁగఁగ నడలొంది వారితోడం జన న
వ్వురుసున . . .

ఆదిపర్వము.

చం. చరణహతిం లతాతరులు చాల్పడి జర్ఝరితంబులై మహిం
దొరఁగఁగ సిట్టు లొండొరులతో . . .

శకటరేఫయగుటకు - కర్ణపర్వము.

చం. మఱియొకఁ డేను జెప్పెద నమానుషవిక్రమలీల నల్గడం
బఱపి యుఁ జంపియుం రిపునృపాలకసైన్యము రూపడంచి మే
దొఱఁగుట యొప్పదే తనువు తూటులుగాఁ గడుఁ బేరువాడి.

విరాటపర్వము.

గీ. తొఱఁగు వోకుండ మెకములు - గఱువకుండ.

3 నెరయు + నెఱయు.

రేఫయగుటకు - ఆదిపర్వము.

కం. తరళనయనాబ్జదళములు, నెరయఁగ మై మున్ను చల్లి నృపసుతుఁ బూజించిరి

శకటరేఫయగుటకు - విరాటపర్వము.

గీ. మెఱయ నీకుఁ గృతజ్ఞత - నెఱపువాఁడ.

ఉద్యోగపర్వము.

గీ. మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ.

౪ పరుసఁదనము + పఱుసఁదనము

రేఫయగుటకు - ద్రోణపర్వము.

కం. తురగముఁ దురగముఁ గరికరి, నరుఁడు నరుఁడు తేరుదేరు నలిదాఁకిన య
ప్పరుసఁదన మేమిచెప్పుదు. . . .

శకటరేఫయగుటకు - సభాపర్వము.

గీ. చిఱుతవాని కింత - పఱుసదనమ్ములు.

౫ ఆరు + ఆఱు.

రేఫయగుటకు - శాంతిపర్వము.

కం. కౌరవులు సేయునవమతి, కారణముగఁ గోపమెత్తుఁ గర్ణునివదనాం
భోరుహము గనుఁగొనఁగ శమ, మారున్నావశముగాక నంతనబుద్ధిన్.

శకటరేఫయగుటకు - ఆదిపర్వము.

కం. కాఱడవిబఱచుమృగముల, నూఱటకుం దివిచి డస్సియున్నతని శ్రమం
బాఱఁగ నెదఁబరితాపము, దీఱఁగ . . .

౬ కారు + కాఱు.

రేఫయగుటకు - భీష్మపర్వము.

కం. కార్చిచ్చు బొదవుకరణి శ, రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటిన్.

శకటరేఫయగుటకు - గారడవియనుపైపద్యమే.

కం. ప్రామాణికాగ్రగణ్యము, గా మతిమంతులు దలంత్రుగద భారత మం
దీమెయి రేఫకు నుభయవి, ధామోదము గలుగుటరయుఁ డార్యులుదానన్.

కం. భారతమున నిట్లుండఁగ, వేరుకృతుల వెదుక నేల వివిధముగభిదా
పారిప్లవ మగణేయము, గా రహియించు నొకఁటికి నొకటి సరిపడకన్. ౭౯

తే. తెలియఁగా రేఫభేదసంకలనమునకుఁ, బ్రాసదృష్టంబులనునొక్కపలుకె కాని
వేరులక్షణమునుఁ జెప్పనేర రెవరు, ప్రాసములు నెన్న నేకరూపములు గావు.

వ. ప్రాసములు వదలి లక్షణంబు లేమేని గలవే యని చూడ నందుఁ గూచి
మంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు

కం. వెల్లంకి తాతయార్యుఁడు, తెల్లముగా శకటరేఫ దీర్ఘంబులపైఁ
జెల్ల దని పలికె నదియుం, గల్ల వితర్కింపఁ బ్రౌఢకవిసమ్మతులన్.

గీ. పదము మొదల నిడుద తుది తద్భవంబుల, రేఫ కాని శకటరేఫ కాదు
నిక్కమనుచు సుగుణనిధి దిట్టకవి వేంక, టార్యవరుఁడు నుడివె నది హుళక్కి.

గీ. పదము మొదల నిడుద తుదిగురు రేఫలు, గలిగియుండుఁ గృతులఁ గాటముగను
దెలియవలయు దీని తెరగెల్ల సుకవులు, తేటపరతు వినుము త్రిపురమథన

అనిచెప్పె. మఱియు నప్పకవీయమునందు,

సీ. వెల్లంకితాతన బోల్లెను బండిరా నిడుదపైఁగలుగదు నిక్కమనుచుఁ
గావున నేను దీర్ఘములపైఁ గలపెదరా లొకకొన్ని యేర్పరతునింక

అనిచెప్పె. భారతములక్ష్మీపతి శకటరేఫనిర్ణయ మనుగ్రంథమందు,

శ్లో. దీర్ఘపూర్వేతు రేఫస్యా న్నభవేచ్ఛకటః క్వచిత్
ప్రథమస్య నశాకట్యం దీర్ఘపూర్వస్యనోభవేత్

అనిచెప్పె నివ్విధంబున.

కం. పలుకవ్రులు బండిరాకై, పలుమరు సిద్ధాంతభేదపారిప్లవసం
కలితులగుచుండ భేదముఁ, దెలియఁగ నిదమిద్ధ మనెడు తెరఁ గెట్లొక్కో. 30

కం. ఇది శకట మిద్ది కా దని, చెదరక సాధువయి నిలుచు సిద్ధాంతం బ
బ్బదు లక్షణశాస్త్రంబుల, నిది యేమిటిగొడవ బండి యేటికి రాకున్. 31

కం. నన్నయ రేఫద్వయభే, దోన్నయనము సేయుకొరకు నొగి లక్షణమున్
మున్ను వచించెన శకటం, బిన్నెలవున నిలుచు రాకు నిది తెరవనుచున్. 32

కం. రా కొక్క బండి కలదను, జోకయె యానన్నపార్యసూత్రార్థంబై
దాకొనిన లక్షణంబున, వాకొనఁడే బండినెక్కవలె నిట ననుచున్. 33

కం. యతులం బ్రాసల రేఫ, ద్వితయమునకు నధికమైన భేద మనుచుఁ బం
డితు లాడుదు రింతియె బలు, కృతులం దత్సంకరంబు దృష్టంబ యగున్.

అప్పకవీయమునందు,

తే. జ్ఞాతి వైరంబు నొంది ప్రాసంబులందు, విశ్రమములందుఁ దమలోన వేరుగలిగి
దేవదానవులట్లన తెనుఁగులందు, మించి రేఫరకారముల్ మెలఁగుఁ గృష్ణ.

కం. భ్రమయక రేఫములకు రే, ఫములను రాలకును రాలు బ్రాసములను వి
శ్రమములనుఁ జెప్పఁదగు నీ, క్రమ మెఱుఁగక రెండునుంగుకవిగూర్చుఁ గృతిన్.

అని పెనఁగులాడి

సీ. ఎఱకలు నా ఱెక్క లెఱుఁగుట తెలిఁగుట
అని తానే "ఎఱుఁగుట" శకటరేఫగాఁ జెప్పి

మ. పురిటింటన్ బసిబిడ్డ చందమున వాపోవంగ నాఁడాత్మలో
మురువొప్పన్ విషదుగ్ధయుగ్మకుచయై ముద్దాడు రాకాసిగు
ఱ్ఱెఱేఁగిష్టంబుగఁ బాలుద్రావు మిషచే నిర్వైవనకాలంబునన్
ధరణిం గూల్చిన నందపుత్త్రువలనం దార్క్షణ ధర్మస్థితుల్

అని ప్రాసమునందును,

సీ. ఱట్టు ఱంపిల్లుట ఱన ఱంకె ఱవికలు
అని ఱట్టు శకటరేఫముగాఁ జెప్పి

ఉ. ఱట్టిడి కాకు నూరిపెద - రంగయ సోముఁడు గాంచె వేడుకన్

అని యతియందును రేఫద్వయమునకుఁ దానే సంకరము చేసినాఁడు. ఇంక నీ రేఫద్వయమును యతిప్రాసలసంకరము చేసినవార లనేకులు గలరు. వారిలోఁ బ్రసిద్ధులనొకరిద్దరినిఁ జూపెద.

శా. శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బా-ఱున్ బక్షులుష్ణాంశు

అల్లసాని పెద్దన్న మనుచరిత్రమునందు,

మ. గుం । డ్రలునాఁ దేనె కొలంకులన్ బొరలి పొ-ర్లన్ విచ్చు ·

అల్లసానిపెద్దన్న ఆముక్తమాల్యదయందు,

సీ. "రేఖలై మీఁదటి జేవులై యున్న" కళాపూర్ణోదయమున,

కం. జెక్కలు గట్టుకొని దివిజ - రిపుమేడలపై

అనిపింగళిసూరన్న ప్రభావతీప్రద్యుమ్నమున,

ఉ. నూఱులు వేలుమ్రోయగ వనుల్ వడివెల్వడి హత్తి యుత్తర

ద్వారమునంక . . .

అనిరామభద్రుఁడు రామాభ్యుదయమున,

ఉ. తూరుపుతెల్లవారుటయు దోడన మంగళపాఠకధ్వనుల్

మీఱ. . . .

అని పిల్లల మర్రి వీరభద్రయ్య జైమినీభారతమున,

గీ. "త్రేవులనకాని చొరరానిరీతిఁ దనరి" కవికర్ణరసాయనమున,

ఉ. జెక్కలమాటునన్ ననుభరించి లభింపుము కీర్తిపుణ్యముల్

బాలసరస్వతి చంద్రికాపరిణయమున,

వ. అని సుప్రసిద్ధులగు కవులే వీనిసాంకర్యము చేసినారు. దీనికిం గారణ మీ చోట శకటరేఫ యని, యీచోట రేఫయని నిర్ధారణ చేయఁగల నిర్వివాద మగులక్షణసూత్రసంపాదన లేమి యనక రేఫద్వయవాదులు మాత్రము వే రేమిచెప్పఁగలరు.

ఉ. ఇక్కడ బండినెక్కుఁ డిగు నిక్కడ రేఫమటంచు భేదమున్
జక్కఁగ నేర్పరించుటకుఁ జాలినసూత్ర మొకండు లేమిచే,
నిక్కరణిం గడంగి యొకఁడెక్కఁగఁ జేసిన బండి బల్మి మై
నొక్కఁడు డింపఁజొచ్చెఁ దగునో తగదో యని యాడ రెవ్వరున్. ౩౫

ఉ. మూలము లేనిభేదమున ముద్రితవాదము పూని పండితుల్
కాలము రిత్తగాఁ గడుపఁగా ఫలమేమొకొ రాకు బండిపై
గూలఁగనేల రాజసమొ కుంటితనంబొ యెరుంగజాల మే
యోలముఁ గన్నఁబల్కుఁబడియొక్కటియేకద వాద మేటికిన్. ౩౬

ఉ. నన్నయ కిట్టిభేదము మనంబునఁ గల్గిన సూత్రకల్పనం
బు న్నెలకొల్పఁడే మరియు మున్నొకని యొక్కపదంబునందు రా
గొన్నిఁట బండిరా యనుచుఁ గొన్నిఁట రేఫమటంచుఁ బ్రాసలం
దున్నిలుపంగఁ జూచునె ఘనుండతఁడంత వివేకహీనుఁడే. ౩౭

వ. కావున నన్నయ కీభేదము లే దనుట నిశ్చయము. పిమ్మట పెనఁగులాడిన వారు బండిరా లెవ్వి యని రాఁగా భారతమునందు కేవలము తెలుఁగుపదములు ప్రాసస్థానంబుల నిలిపిన వానియందలి రాలు బండిరా లన నందుఁ గొన్ని మరల సంస్కృతపదంబులతోఁ బ్రాసలందు నిలిచి కనఁబడినందున.

కం. తమవాదము పడిపోవఁగ, నములిన ధీమంతు లుభయమని యొకతడక
డ్డము వెట్టిరి నిక్కమునకు, సమకొను నే యట్టిచాఁటు సత్పథ మగుచున్.

కం. ఒకపదమున రేఫంబై, శకటంబై మారుటకును సమకొన నీఁకనే
టికి నిట్లు భేదవాదము, నకుఁ దొరకొని వ్యర్థముగఁ బెనఁగులాడుటకున్. ౪౦

ఉ. వేలుపుబాస రేఫ మది ద్విత్వము నొందక యిందు ద్విత్వస
మ్మేళన మొంద నట్టివిధమే తెలిపెన్ బదసిద్ధి లోకమే
మూలముగా ఘటిల్లుఁగద పూనిక లోకము రేఫభేదమున్
బోలఁగఁ జెప్పనే పదసమూహము వాడుక నెందునేనియున్. ౪౧

తే. తవిలి యుచ్చారణమున భేదంబుశబ్ద
సిద్ధివలన లభ్యము గాఁగఁ జెప్పఁ దరమె
శాస్త్రనియమంబు లేదయ్యెఁ జాలునింకఁ
జాలునీవాదమున కెద్ది మూల మొక్కొ. ౪౨

ఉ. కావున రేఫవాద మది గ్రాహ్యముగాదు ఫలంబులేదు భా
షావిశదత్వసిద్ధికిఁ బొసంగెడు వృద్ధికి భంగహేతువై
దానలమా రయోస్తనుపదంబున నన్నయసూత్రపఙ్క్తికిన్
భావితమైన యర్థమును బండితు లొప్పఁగఁ జెప్పఁగా వలెన్. ౪౩

కం. ఇదిసిద్ధాంతం బనఁగా, నొదవెడు చంద్దంబు నేఁటి కొక్కఁటియును గ
ల్గదు వాదము పారిప్లవ, మదియేటికి భాషసాధువగునే దానన్. ౪౪

తే. జడ్డ యగు రేఫ మలఘువు సాధు రేఫ ,లఘు వనిన సరిపడు సూత్రలక్షణమున
కట్లుభాషయు సాధువౌ నంతెకాక, బండియేటికి రేఫకుఁ బట్టికట్ట. ౪౫

తే. కాలు విరిగిన విరుగు నక్కట నుభయత
బండి బోరలఁ బడ ననుభయముచేత
శకటమును డింపినడపెద సరసముగను
తెలుఁగు రేఫను గనలొంగ వలదు కవులు. ౪౬

తే. మంజులం బైనశాస్త్రసమ్మతవిధమునఁ, దవులు రేఫవాదంబు సాధువుగఁ జేసి
యాంధ్రకవితావధూమణి నమలసుపథ, గతిఁ జరింపఁ బ్రహార్థితగా నొనర్తు

నందగిరి వెంకటప్పారావు.

— సభకువచ్చిన కొందఱ నామములు. —

మ-రా-రా-శ్రీ, శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యరావు బహద్దరుగారు, పిఠాపురం మహారాజాగారు.

,, గౌరవనేయులు రాజా శ్రీపానుగంటి రామారాయణంగారు, ఎం. ఏ., చెన్నపురము.

,, రాయిసాహేబు గుమ్ముడూరి వేంకటరంగారావుగారు, ఎం.ఏ., చెన్నపురము.

,, టి. మురుగేశము పిళ్లెగారు, పెరియకుళము, మధుర.

,, గునుపాటి యేనాదిరెడ్డిగారు, కొత్తూరు, నెల్లూరు.

,, టి. వి. వెంకన్నయ్యగారు, ఎం. ఏ., బెంగుళూరు, (కర్ణాట సాహిత్యపరిషత్పక్షమున.)

,, ఆర్. వేంకటరామసోమయాజిగారు, నైజాముకాలేజి, హైద్రాబాదు.

,, అయ్యంకి వేంకటరమణయ్యగారు, బెజవాడ.

,, ఉపాధ్యాయుల వేంకటరమణయ్యపంతులుగారు, గుంటూరు.

,, శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావు బహద్దరుగారు, నూజవీడు.

,, శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఉయ్యూరు జమీందారుగారు.

,, త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు, సిద్ధాంతము, గంజాము.

,, అడపా వాసుదేవరామానుజులు నాయుఁడుగారు, అల్లాజీపేఁట, గంజాము.

,, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, విశాఖపట్టనము.

,, నిడదవోలు సుందరముపంతులుగారు,విశాఖపట్టనము.

,, బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు, ఎం. ఏ., విజయనగరము.

,, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.

,, కవిరాజు శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజాగారు, తుని.

,, కేతవరపు వేంకటశాస్త్రిగారు, విశాఖపట్టనము.

,, నందగిరి వేంకటప్పారావుగారు, గుడివాడ.

,, దాసురాజు శోభనాచలముగారు, ఏలూరు.

,, క్రొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౧. | దుందుభినామసంవత్సరము. జ్యేష్ఠ—భాద్రపదమాసములు. | సంచిక ౨, ౩.

శ్రీరస్తు.

## ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభావృత్తాంతము.

ఆ ౧౯౨౨ సంవత్సరము సెప్టెంబరు నెల ది ౨, ౩ తేదులు, శనివారము, ఆదివారములయందుఁ బరిషదేకాదశవార్షికసభ గోదావరిమండలములోని పిఠాపురములో శ్రీమహారాజావారికోటలో నడచినది. పరిషత్తును దమరాజధానికాహ్వానించిన. శ్రీమహారాజావారి కనారోగ్యముగానుండి చెన్నపురమునందు వసించుటవలనను, వేసవి యత్యధికముగాఁ దీర్చుటవలనను జైత్రవైశాఖములలో జరగవలసిన యీసభ భాద్రపదమాసమున జరగినది. విశేషదినములు సెలవులు లేనికారణమున నున్నరెండుదినములలోనైననుఁ బాఠశాలలవారికే గాని యితరోద్యోగములవారికి శనివారముపయోగపడనిహేతువున, దూరమునందున్న భాషాభిమాను లగునుద్యోగులు పెక్కురు రాలేదు. కాని వచ్చినవారిలో సభకుఁ జాలినంతమంది యుండిరి. శ్రీమహారాజావారు స్వాగతసంఘాధ్యక్షులుగా నుండిరి. రైలుస్టేషనున కతిసమీపముననున్న మహారాజావారి ఆర్. సి. హెచ్. హైస్కూలుభవనములో స్థలాంతరములనుండి వచ్చినవారికి బసలును భోజనసదుపాయములును గావింపఁబడినవి. కోటలో మొదటిభూమికపై సభ గావింపఁబడినది.

— సభకువచ్చిన కొందఱ నామములు. —

మ-రా-రా-శ్రీ, శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యరావు బహద్దరుగారు, పిఠాపురం మహారాజాగారు.

,, గౌరవనేయులు రాజా శ్రీపానుగంటి రామారాయణంగారు, ఎం. ఏ., చెన్నపురము.

,, రాయిసాహేబు గుమ్ముడూరి వేంకటరంగారావుగారు, ఎం.ఏ., చెన్నపురము.

,, టి. మురుగేశము పిళ్లెగారు, పెరియకుళము, మధుర.

,, గునుపాటి యేనాదిరెడ్డిగారు, కొత్తూరు, నెల్లూరు.

,, టి. వి. వెంకన్నయ్యగారు, ఎం. ఏ., బెంగుళూరు, (కర్ణాట సాహిత్యపరిషత్పక్షమున.)

,, ఆర్. వేంకటరామసోమయాజిగారు, నైజాముకాలేజి, హైద్రాబాదు.

,, అయ్యంకి వేంకటరమణయ్యగారు, బెజవాడ.

,, ఉపాధ్యాయుల వేంకటరమణయ్యపంతులుగారు, గుంటూరు.

,, శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావు బహద్దరుగారు, నూజవీడు.

,, శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఉయ్యూరు జమీందారుగారు.

,, త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు, సిద్ధాంతము, గంజాము.

,, అడపా వాసుదేవరామానుజులు నాయుఁడుగారు, అల్లాజీపేఁట, గంజాము.

,, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, విశాఖపట్టనము.

,, నిడదవోలు సుందరముపంతులుగారు, విశాఖపట్టనము.

,, బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు, ఎం. ఏ., విజయనగరము.

,, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.

,, కవిరాజు శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు, తుని.

,, కేతవరపు వేంకటశాస్త్రిగారు, విశాఖపట్టనము.

,, నందగిరి వేంకటప్పారావుగారు, గుడివాడ.

,, దామరాజు శోభనాచలముగారు, ఏలూరు.

,, క్రొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు.

మ-రా-రా-శ్రీ, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, కొవ్వూరు.

,, S. T. G. వరదాచారిగారు, ఎం,ఏ., కొవ్వూరు.

,, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బందరు.

,, విస్సా అప్పారావుగారు, ఎం.ఏ., రాజమహేంద్రవరము.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమహేంద్రవరము.

,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.

,, సముద్రాల వేంకటప్పలాచార్యులుగారు, రాజమహేంద్రము.

,, భావరాజు వేంకటకృష్ణారావుగారు, బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.

,, వెన్నేటి రామచంద్రరావుగారు, బి.ఏ.,బి,ల్.. రాజమహేంద్రవరము.

,, తాడూరి లక్ష్మీనరసింహారావుగారు, రాజమహేంద్రవరము.

,, ధేరం వేంకటాచలపతిగారు, బి.ఎ., రాజమహేంద్రవరము.

,, దివాన్ బహద్దరు దురిసేటి శేషగిరిరావుపంతులుగారు, బి.ఏ., బి.ఎల్., కాకినాడ.

,, దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, కాకినాడ.

,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.

,, మోచెర్ల హనుమంతరావుగారు, కాకినాడ.

,, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, కాకినాడ.

,, దర్భా వేంకట శివరామరాసుగారు, బి.ఏ.,బి.ఎల్., కాకినాడ.

,, రవిపత్రికా ప్రకాశకులు, కాకినాడ.

,, ఆంధ్రపత్రికావిలేఖకులు, కాకినాడ.

,, శ్రీరావు అచ్చయ్యారావుగారు, క్రొత్తపల్లి.

,, శ్రీచెలికాని లచ్చారావుగారు, చిత్రాడ.

,, శ్రీచెలికాని ధర్మారావుగారు, చిత్రాడ.

,, శ్రీచెలికాని చినజగన్నాథరావుగారు, చిత్రాడ.

,, జయంతి రామయ్యపంతులుగారు, బి.ఎ.,బి.ఎల్., ముక్తేశ్వరము.

,, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు, పిఠాపురము.

మ-రా-రా-శ్రీ, పురాణపండా మల్లయ్యశాస్త్రిగారు, పిఠాపురము.
,, పేరి పేరయ్యశాస్త్రిగారు, పిఠాపురము.
,, శతావధానులు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, పిఠాపురము.
,, కూచి నరసింహంగారు బి. ఏ., పిఠాపురము.
,, శ్రీదామెర సీతారామస్వామిగారు, పిఠాపురము.
,, దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, తుని.
,, కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు, పిఠాపురము.
,, ద్రోణమురాజు రామమూర్తిగారు, పిఠాపురము,
,, దేవులపల్లి వేంకటరామయ్యగారు, బి. ఏ., పిఠాపురము.
,, గొల్లకోట వేంకటరామయ్యగారు, బి. ఏ., పిఠాపురము.
మఱియుఁ బౌరులు ననేకేతరాంధ్రభాషాభిమానులు దయచేసిరి.

దీ ౨ సెప్టెంబరు శనివారము ౧౧ గంటలకు సభ ప్రారంభమైనది. మహారాజాగారికి దొరతనమువారు దయచేసిన మహారాజు బిరుదమునకు సభవారెల్లరుఁ దమయానందమును వెల్లడించిరి. బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిగాగాశీర్వచనరూపకపద్యములం బఠించిరి. ఆహ్వానసంఘపక్షమున మహారాజావారు స్వాగతోపన్యాసముం జదివిరి. ఆచారప్రకారముగా సభ్యక్షునియెన్నిక జరిగినపిదప మ॥ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగా రధ్యక్షస్థానము నలంకరించి తదభిభాషణవ్యాసమును జదివిరి. గౌరవనేయులు రాజా శ్రీపానుగంటి రామారాయణంగారు ఎం. ఏ, గారు స్వాగతోపన్యాసములో మహారాజావారొనర్చిన శిష్టసభాప్రశంసకుఁ గొంత సమాధానరూపముగఁ తత్పురో వృద్ధిసూచన లగపడఁ బ్రతిభాషించిరి. పిదపఁ బ్ర-శ్రీ. పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి సూత్రభాష్యసంగ్రహము చదువంబడినది. సభకు రాఁజాల మని వ్రాసిన పలువురయుత్తరములుఁ దంత్రీవార్తలుఁ జదువఁబడినవి. మ॥ వెన్నేటి 'మచంద్రరావు బి.ఏ., బి.ఎల్. గారు కొన్నిపద్యములం జదివిరి. పిఠాపుర ంస్థానకవులు బ్ర॥ ఓలేటి వేంకటరామశాస్త్రిగారు నన్నయభట్టారకాది కవు ులపైఁ గొన్నిపద్యములను, ఔచిత్యవిషయవ్యాసమును జదివిరి. భావరాజు వేంకటకృష్ణారావు బి.ఏ, బి.ఎల్. గారు దీ ౮-వ తేదిని రాజమహేంద్రవరములో నడవఁబోవు నైతిహాసికసభకు రమ్మని సభవారి నాహ్వానించిరి. విశాఖపట్టనము కళాశాలాంధ్రోపాధ్యాయులు బ్ర॥ కేతవరపు వేంకటశాస్త్రిగారు "ఆధునికాంధ్రభాషాపరిస్థితులు", పిఠాపురనివాసులు కూచి నరసింహము బి.ఏ.

